PARLE

# Ram and Shyam




హుమ్మ్...పాపిన్స్!

HOUNDING KING CREEP

జయలక్ష్మి కాలోనిలో
రామ్ మరియు శ్యామ్.
క్రూరంగా పెంపుడు జంతువులను
దొంగలిస్తున్నవారిని వెంటాడుతున్నారు.

మన కాలోనిలో ఎవరు
పెంపుడుజంతువులను దొంగలిస్తున్నారో
ఆశ్చర్యం కలిగిస్తుంది కదూ.

MISSING

కాలోనిలో ఎందరో పిల్లలకు తెలిసిన
విధంగానే, అక్కడగల అన్ని వాహనాల
గురించి వారికి తెలుసు. ఒక రోజు

వారికి విచిత్రమైన
వ్యాన్ కనిపిస్తుంది....

ఆ గుట్టు తెలియని వ్యాన్
ఇక్కడ ఏం చేస్తుంది?

మనం వెంటాడి చూద్దాం
ఇంటి దగ్గర వ్యాన్ ఆగగానే....

దాని కింగ్ క్రీప్ మరియు గూన్స్
మన పెంపుడు జంతువులను
దొంగలిస్తున్నారు.

అదిగో ఎముక
ఎర చూపించి
పట్టుకుంటున్నారు.

గూన్స్ బిజీగా ఉన్నప్పుడు, మన హీరోలు
వెనకనుంచి తలుపులు తెరచి కుక్కలను
విడుదల చేస్తారు.

మేము మిమ్మల్ని కాపాడుతాము.

శ్యామ్ పాపిన్స్ తీయగానే,
కుక్కలు రంగు మారి
కనబడకుండా పోతాయి

పాపిన్స్ నన్ను కాపాడు

కుక్కలు గూన్స్‌వైపుకి
[illegible]
అవి భయంతో పరుగెడుతాయి.

పాపిన్స్ మజా
చూపించామ్ కదు.





చందమామ సంపుటి: 60 ఫిబ్రవరి 2008 సంచిక:02

## ఈ నెల విశేషాలును

















## ఈ సంచికలో...





వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

## అమరవాణి

ఉత్సాహమూ,
సాహసమూ,
ధైర్యమూ,
బుద్ధీ, శక్తీ,
పరాక్రమమూ
ఈ ఆరూ
ఎక్కడైతే
ఉంటాయో
అక్కడ దేవుడే
ఉంటాడు.





# పిల్లలకు ఆదర్శం ఎవరు?

**2007** వెళుతూ వెళుతూ పిల్లలకు, తల్లిదండ్రులకు, ఉపాధ్యాయులకు రెండు విషాదకర దుర్ఘటనలను మిగిల్చివెళ్ళింది. హర్యానా గుర్గాంవ్‌లోని ఒక పాఠశాలలో ఇద్దరు విద్యార్థులు సహవిద్యార్థిని కాల్చిచంపారు. ఆ విషాదం నుంచి బయటపడక ముందే ఉత్తర ప్రదేశ్ ఫిరోజాబాద్‌లో గుర్తు తెలియని కొందరు వ్యక్తులు ఒక పాఠశాల ప్రధానోపాధ్యాయుణ్ణి కాల్చి చంపారు. దోషులను కఠినంగా శిక్షించాలని పిల్లలు పోరాటానికి దిగితే, పోలీసులు వారిపై లాఠీచార్జ్ చేశారు. ఇది మరీ ఘోరం!

పైరెండు సంఘటనలూ–విద్యార్థులలో రోజు రోజుకూ పెరిగిపోతూన్న తమ మాటను నెగ్గించుకోవడానికి హింసకైనా ఒడిగట్టవచ్చన్న విపరీత మనస్తత్వాన్ని చాటుతున్నాయి.

బుద్ధుడు అహింసను బోధించిన పుణ్యభూమి మనది. నిన్న గాక మొన్న అహింసా మార్గంలో, సత్యాగ్రహంతో స్వాతంత్ర్యాన్ని సాధించి పెట్టిన మహాత్మాగాంధీ పుట్టినదేశం మనది. పైగా, మహాత్మాగాంధీని జాతిపితగా మనం గౌరవిస్తున్నాం.

యువతరం ఒక వైపు వివిధ రంగాలలో ముందుకు దూసుకుపోతోంది. మరోవైపు అక్కడక్కడ, అప్పుడప్పుడు ఇలాంటి అపస్వరాలు వినిపిస్తున్నాయి. వీటన్నిటికీ కారణం ఏమిటి? ఎవరు కారకులు? ఆర్థిక అసమానతలు, సామాజిక పరిస్థితులు, రాజకీయ రాద్ధాంతాలు, టీవీలు, సినిమాలు వంటి మాధ్యమాల విపరీత పోకడలు ఇలా కారణాలు అసంఖ్యాకాలు. అయితే, ఇవన్నీ ఎలా ఉన్నప్పటికీ పిల్లలు మొదట తమకు ఆదర్శంగా తీసుకునేది తల్లిదండ్రులను. కాబట్టి తల్లిదండ్రులైన మనం ఆదర్శవంతంగా నడుచుకుందాం. పిల్లలను ఆదర్శవంతమైన పౌరులుగా తీర్చిదిద్దడం మన ప్రధాన బాధ్యతగా గుర్తిద్దాం!

సంపాదకుడు : **విశ్వం**





చందమామ

Editor, Publisher : B. Viswanatha Reddi (Viswam)
Chief Executive Officer : L. Subramanyan
Editorial Advisors : Ruskin Bond, Manoj Das
Consultant Editor : K. Ramakrishnan
Associate Editor : A.R. Balasubrahmanyam
Artists: K.C. Sivasankaran (Sankar)
Gandhi Ayya, P. Mahesh
Layout Design: R. Sudha
Assistants: D. Revathy, B.A. Hemalata Malini
Research : R. Vaasugi

CIRCULATION TEAM :
Chennai : T N Ravi Shankar, National Sales Manager
Mobile +9199620 70014
email: ravishankar.tn@chandamama.com
Mumbai : Sanjay Thorat, Business Development Manager
Mobile +91 98210 17787
CHANDAMAMA INDIA LTD., B-3, Lunic Industry
Opp. State Bank of India, Near Police Station Cross Road
No.6, MIDC Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email: sanjay.thorat@chandamama.com
New Delhi : Sushil Sharma, Circulation Manager-North
Mobile +91 98719 30767
CHANDAMAMA INDIA LTD., Goyal Business Centre,
C-23/2 First floor, Connaught Place, New Delhi-110001
Bangalore : P. Murali, Asst. Circulation Manager -Karnataka
Mobile +91 94488 36952
CHANDAMAMA INDIA LTD., 18, 10th Cross, Mayura Street
Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage
Bangalore-560094, Phone +91 80 6655 1000
email:murali.p@chandamama.com
Kolkata : Ananth Prakash, Circulation Manager-East
Mobile +91 98351 82202
Advertisement : email : sales@chandamama.com
Online and Interactive : Surajit Agarwal
Mobile +91 99620 70015
email: surajit.agarwal@chandamama.com
Head Office : CHANDAMAMA INDIA LTD.,
JVL Plaza, Block-A, 6th Floor, 626, Anna Salai, Teynampet
CHENNAI-600018, Phone +91 44 2432 2101/02,
Fax +91 44 2432 2103
email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

చందా

ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ.180.00
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ,
మనిఆర్డర్ ద్వారాగానీ 'చందమామ
ఇండియా లిమిటెడ్' పేరిట పంపండి.

# పాఠకుల లేఖలు

**రూ. 250/- బహుమతి పొందిన లేఖ**

విలక్షణ వినోదం, సలక్షణ విజ్ఞానంతోపాటు విశిష్ట సందేశాలతో, సంస్కృతీ సంప్రదాయాల మేళవింపుతో, ముచ్చటైన బొమ్మల ముద్రణతో, తేలిక పదాలతో తనదైన ప్రత్యేకబాణీలో పాఠకులను పఠనోన్ముఖులుగా చేయగలిగిన చతురత ఒక్క 'చంద మామ'కే చెల్లింది.

'వైద్యుడి ఎంపిక' కథ ''రోగిలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించగలిగిన వాడే నిజమైన వైద్యుడు'' అనే సమకాలీన వైద్య మార్గదర్శసూత్రాన్ని ప్రతిపాదిస్తే, 'కష్టమైన పని' కథ ''ఎంతటి కష్టమైన పనినైనా ఇష్టపడి చేయడంలో గల సౌలభ్యాన్ని ఆవిష్కరించింది. ''జీవితాలు మారాలంటే మొదట మన బుద్ధులు మారాలనే'' జీవన సూత్రాన్ని 'ప్రాప్తం' కథ ప్రబోధిస్తే, 25 ఏళ్ళ నాటి 'మీసాలయ్య-గుండయ్య' కథలో సామాజిక దుర న్యాయమైన ''వరకట్న సమస్య''ను ఆనాడే ప్రతిబింబించి చందమామ పత్రిక, 'సామాజికసమస్యా చిత్రిక'గా కూడా సార్థకతను సంతరించుకున్నది.

గత సంవత్సర పత్రికా పురోగమనాన్ని సింహావలోకనం చేస్తూ, ''చందమామ ఇంతటితో విశ్రమించకుండా నవతరానికి సేవలందించేందుకు నూతన మార్గాల నన్వేషిస్తూ ముందుకు సాగుతూనే ఉంటుంద''న్న విశ్వంగారి సంపాదకీయం పాఠకులకు నూతనోత్తేజాన్నందించటమేగాక సమర్థవంతమైన పత్రికా నిర్వహణ పట్ల ప్రగాఢ విశ్వాసాన్ని ప్రస్ఫుటీకరిస్తోంది.

సాహిత్యాభిరుచి పెంపొందించే 'క్రాస్ వర్డ్ పజిల్', 'పాఠకుల స్వగతం', 'చిట్టి కవితలు' వంటి శీర్షికలు ప్రవేశ పెడితే బాలవికాసానికి 'చందమామ' మరింత దోహద పడగలదు. –జి. రజని, వెంకటగిరి – **524 132**



# మూడు కలలు

ధర్మనిరతుడైన గోకర్ణికరాజు మణికర్ణుడికి యోగిపుంగవులన్నా, సాధు సన్యాసులన్నా అమిత గౌరవం. ఆయన తరచూ మహనీయులైన యోగులను దర్శించి వారి ఆశీర్వాదం పొందేవాడు. రాజధానికి వచ్చే సాధు సన్యాసులను సాదరంగా ఆహ్వానించి భక్తి శ్రద్ధలతో అతిథి సత్కారాలు చేసేవాడు.

ఒకసారి జడధారి అనే సన్యాసి రాజభవనానికి విచ్చేశాడు. యథా ప్రకారం రాజు ఆయనకు అతిథిసత్కారాలు అందించి, సాష్టాంగ దండ ప్రమాణం చేశాడు. రాజు వినయ విధేయతలకు, ధర్మబుద్ధికి పరమానందం చెందిన జడధారి, ఎన్నో ఆధ్యాత్మిక విషయాలు బోధించి, బయలుదేరే ముందు, ''మహారాజా! నీతో ఒక ముఖ్య విషయం చెప్పాలి. నువ్వు ఈ రోజు నుంచి మూడు రాత్రులు వరుసగా మూడు దుస్వప్నాలు కాంచబోతున్నావు. అప్రమత్తతతో వ్యవహరించు. లేకుంటే ప్రమాదం బారిన పడగలవు,'' అని హెచ్చరించి వెళ్ళాడు.

అది విన్న రాజు ఎంతగానో కలవరపడ్డాడు. వెంటనే మంత్రులను సమావేశ పరచి, విషయం వివరించాడు. అప్పుడు వివేకవర్ధనుడనే వృద్ధ మంత్రి, ''జడధారి మీకు రాత్రి సమయంలోనే దుస్వప్నాలు రాగలవని హెచ్చరించాడు గనక, మీరు పగటి పూట నిద్రించి మూడు రాత్రులూ మెలకువగాగడపండి. అప్పుడు స్వప్నాలూ రావు. ప్రమాదాలు సంభవించే అవకాశమూ ఉండదు,'' అని సలహా ఇచ్చాడు.

రాజుకు ఆ సలహా నచ్చింది. ఆయనకు సంగీతం, చదరంగం, ఆధ్యాత్మిక విషయాల పట్ల ఆసక్తిమెండు. అందువల్ల రాత్రి సమయంలో వాటితో కాలక్షేపం చేస్తే నిద్రరాదని

ఎన్. శివనాగేశ్వరరావు



మైన సంగీతం వింటూ ఉండగా ఆయన కొద్ది క్షణాలు కళ్ళుమూసుకున్నాడు. ఆకాశం నుంచి ఒక పెద్ద పిడుగు తనకేసి రావడం చూసి, దాని నుంచి తప్పించుకోవడానికి అటూ ఇటూ పరిగెత్తసాగాడు. అయినా, కలలో పిడుగు ఆయన్ను వెంటాడుతూనే ఉన్నది. అంతలో రాజుకు మెలకువ వచ్చింది.

మూడో రోజు రాత్రి ధార్మిక, ఆధ్యాత్మిక విషయాలు చర్చిస్తూండగా మరలా కునుకు పట్టింది. ఈసారి స్వప్నంలో భయంకరమైన సింహం ఒకటి రాజు మీదికి ఉరికింది. ఆయన ఒక మడుగులో దూకాడు. మడుగులో నీరు రుధిరవర్ణంలో ఉంది. అంతలో యువరాణి మణిమేఖల అక్కడ కనిపించి, తండ్రిని నెత్తురు మడుగు నుంచి పైకిలాగింది. అంతలో రాజుకు మెలకువ వచ్చింది.

తెల్లవారగానే, రాజు మంత్రులను సమావేశ పరచి తన కలల గురించి వివరించాడు. మంత్రులు వెనువెంటనే పాముకాటుకు మంత్రం వేసేవారిని పిలిపించారు. మహారాజు గారిని వేటకుగాని, బయటకు గాని వెళ్ళ వద్దని సలహా ఇచ్చారు. అంతఃపురంలో అంద రినీ అప్రమత్తులు చేశారు. అయినా మహా రాజు కలవరం తగ్గలేదు.

ఆ సమయంలో శివుడనే యువకుడు మహారాజును దర్శించి, ''రాజా! నేను చాలా తెలివిగలవాణ్ణి. కాని నా తెలివితేటలను ఎవరూ గుర్తించడంలేదు. మీరైనా నా తెలివి తేటలను గుర్తించండి. లేకుంటే హిమాలయా లకు వెళ్ళిపోతాను,'' అన్నాడు.

భావించాడు. తక్కిన మంత్రులు కూడా అదే మంచిదని అభిప్రాయపడ్డారు.

ఆనాటి రాత్రి చదరంగం ఆడుతూ గడ పాలని రాజు నిర్ణయించాడు. చదరంగం ఆటలో దిట్టలైనవారిని పిలిపించాడు. తెల్ల వార్లూ చదరంగం ఆడుతూ గడిపాడు. అయితే, తెలతెలవారుతూండగా మహారాజు చిన్న కునుకు తీశాడు.

ఆ చిన్నపాటి కునుకులో మహారాజుకు ఒక కల వచ్చింది. ఆయన ఒక అరణ్యంలో ఉన్నాడు. ఒక త్రాచుపాము రాజును చూసి బుసలు కొడుతూ పైకి ఉరికింది. ఆయనకు ఒళ్ళంతా చెమటలు పట్టాయి. అంతలో మెలకువ వచ్చింది.

రెండో రోజు రాత్రి రాజు సంగీతం వింటూ మెలకువతో ఉండాలనుకున్నాడు. కాని మధుర

ఆ మాటలు విన్న మహారాజుకు వాడు మతి చలించినవాడేమో నన్న అనుమానం కలిగింది. అయినా, ఎవరికి ఎలాంటి శక్తి ఉంటుందో ఏమోనని భావించి, జడధారి తనను స్వప్నాల గురించి హెచ్చరించడం; ఆయన చెప్పినట్టే తనకు వరసగా వచ్చిన మూడు కలల గురించి అతనికి వివరించాడు.

అంతా విన్న శివుడు కొద్ది క్షణాలు ఆలోచించి, ''మహారాజా, యోగులు, సన్యాసులు దైవాంశసంభూతులు. వారి నోటి మాట వృథా కాదు. మిమ్మల్ని కలవర పరుస్తూన్న మూడు కలలను విశ్లేషించి, ఫలితం చెప్పగలను. మొదటి రెండు కలల గురించి వివరిస్తాను. అందులో వాస్తవం ఉందని తెలిస్తే, మూడవ కలకు వివరణ ఇస్తాను,'' అన్నాడు.

''అలాగే, చెప్పుమరి. ఆలస్యం దేనికి?'' అన్నాడు రాజు ఆదుర్దాగా.

శివుడు కొంతసేపు మౌనంగా ఊరుకుని, ''మహారాజా! మీకు మొదటి కలలో కనిపించిన అరణ్యం జనారణ్యం. త్రాచు పాము పగకు సంకేతం. మీ మీద పగబట్టిన వ్యక్తి ఎవరో మీకు అపాయం తలపెట్టాడన్నదే ఆ కల అంతరార్థం! ఇక పిడుగు అనేది హఠాత్తుగా పడేది. అంటే, ఊహించని ఘటన ఏదో జరగబోతున్నది. పిడుగు మిమ్మల్ని వెంటాడిందంటే జరగబోయే దుర్ఘటన మీకు గురిపెట్టబడివుందని అర్థం,'' అన్నాడు.

రాజుకు శివుడి తెలివితేటల మీద నమ్మకం కుదిరింది. శివుడు ఉండడానికి విడిది ఏర్పాటు చేశాడు. తీవ్రంగా ఆలోచించిన రాజుకు ఒక



విషయం స్ఫురించింది. ఇటీవల రాజ్యంలో బందిపోట్ల బెడద ఎక్కువయితే, దానిని అరికట్టడానికి రాజు ప్రయత్నించాడు. బందిపోట్ల నాయకుడు భైరవుడు తనకు అపాయం తలపెట్టి ఉండవచ్చని భావించిన రాజు, సైనికులతో అష్టదిగ్బంధనం చేయించి, నాయకుడు భైరవుడితో సహా బందిపోట్లందరినీ బంధించాడు. విచారణలో భైరవుడు విషనాగును రాజు శయనమందిరంలోకి పంపి రాజును చంపడానికి కుట్ర పన్నినట్టు ఒప్పుకున్నాడు.

ఆ విధంగా తాను కన్న మొదటి కలకు శివుడి విశ్లేషణ సరైనదని గ్రహించి ఎంతగానో సంతోషించిన రాజు, రెండవ కల వివరణను పరీక్షించడానికి గూఢచారులను అన్ని దిశలకూ పంపాడు.

రెండు రోజుల తరువాత, ఒకగూఢచారి వచ్చి, ''సింహపురి రాజు విక్రమసేనుడు మన రాజ్యం మీదికి దండెత్తడానికి ఆయత్తమవుతు న్నాడు,'' అని చెప్పాడు.

శివుడి తెలివితేటలకు అబ్బురపడిన రాజు, అతన్ని పిలిచి సంగతి చెప్పి, ''అన్ని విధాలా నాకన్నా బలవంతుడైన విక్రమసేనుణ్ణి ఎదుర్కో వడం ఎలా?'' అన్నాడు విచారంతో.

''దానికి మీరు కన్న మూడో కలలో పరి ష్కారం సూచించబడింది, మహారాజా,'' అన్నాడు శివుడు.

''ఎలా?'' అని అడిగాడు రాజు.

''మహారాజా! మీ కలలో కనిపించిన సింహం, సింహపురిరాజు విక్రమసేనుడు. మీరు నెత్తురు మడుగులో పడడం యుద్ధంలో జరగనున్న రక్తపాతానికి సంకేతం. మిమ్మల్ని మడుగులో నుంచి బయటకులాగిన యువ రాణిగారే మిమ్మల్ని ఈ ఆపదనుంచి గట్టెక్కిం చగలరు,'' అన్నాడు శివుడు.

''అదెలా?'' అని అడిగాడు రాజు.

''సింహపురి రాజుకు యుక్తవయస్కుడైన కుమారుడు ఉన్నాడు కదా? ఆయనతో మన యువరాణి వివాహం జరిపిస్తే, యుద్ధ ప్రసక్తే ఉండదు!'' అన్నాడు శివుడు.

అందులోని వాస్తవాన్ని గ్రహించిన మణి కర్ణుడు ఒక మంచి రోజు చూసి కుమార్తె చిత్రపటాన్ని విక్రమసేనుడికి పంపి, ''మీకు సమ్మతమైతే నా కుమార్తెను మీ కోడలిగా స్వీకరించండి,'' అని పురోహితుడి ద్వారా కబురు పంపాడు.

మణిమేఖల అద్భుత సౌందర్యానికి ముగ్ధ డైన సింహపురి యువరాజు త్రివిక్రముడు ఆమెను వివాహ మాడడానికి సంతోషంగా సమ్మతించాడు. దాంతో విక్రమసేనుడు గోకర్ణిక మీద యుద్ధ ప్రయత్నాలు విరమించి కుమారుడి పెళ్ళి ఏర్పాట్లకు శ్రీకారం చుట్టాడు. త్వరలో వారి వివాహం అత్యంతవైభవంగా జరిగిపోయింది.

రాజు విక్రమసేనుడు, తనకు వచ్చిన మూడు కలలను చక్కగా విశ్లేషించి, తగిన సూచనలిచ్చి తన రాజ్యాన్ని పెను ప్రమాదాల నుంచి కాపాడిన శివుణ్ణి ఘనంగా సత్కరించి, తన ఆంతరంగిక సలహాదారుగా నియమిం చాడు.





# నేరము - శిక్ష

కొత్వాలు సంగమేశ్వరుడు ఒకనాడు సాయం కాలం గుర్రం మీద నగర వీధిలో వెళుతూ, నలుగురు కలిసి ఒక యువకుణ్ణి కొట్టడం గమనించి, ''ఎందుకు అతణ్ణి కొడుతున్నారు?'' అని అడిగాడు.

''వీడు గురవయ్యదుకాణంలో బియ్యం మూట దొంగిలించాడు. అందుకే కొడుతున్నాం,'' అన్నాడు ఆ నలుగురిలో ఒకడు.

''వాడు దొంగతనం చేస్తే కొట్టడానికి మీరెవ్వరు?'' అని అడిగాడు కొత్వాలు కోపంగా.

''దొంగతనం నేరం కదా? అందుకే కొట్టాం,'' అన్నారు వాళ్ళు కాస్త బెరుగ్గా.

''నేరం చేసినవాణ్ణి రక్షకభటులకు అప్పగించాలి. విచారణ జరగాలి. నేరం రుజువైతే శిక్షపడుతుంది. అంతేగాని, న్యాయాధికారి చేయవలసిన పనిని మీరెలా చేస్తారు?'' అంటూ కొత్వాలు రక్షకభటులను పిలిచి, దొంగతనం ఆరోపించబడిన యువకుడితో పాటు, అతణ్ణి కొట్టిన నలుగురినీ ఠాణాకు తరలించాడు.

మరునాడు వాళ్ళందరినీ న్యాయాధికారి ముందు హాజరు పరిచాడు కొత్వాలు.

''నీ పేరేమిటి?'' అని ఆ యువకుణ్ణి ప్రశ్నించాడు న్యాయాధికారి.

''వీరయ్య,'' అన్నాడు యువకుడు.

''నువ్వు గురవయ్య దుకాణంలో బియ్యం మూట దొంగిలించావని ఆరోపిస్తున్నారు, నిజమేనా?'' అని అడిగాడు న్యాయాధికారి.

''అయ్యా, నేను వారం రోజులుగా గురవయ్య ఇంటి ప్రహరీగోడ కట్టే పనిచేశాను. వారానికి కూలీ బియ్యంమూట ఇస్తానని ఆయన చెబితేనే నేను పని మొదలుపెట్టాను. పనిపూర్తి చేశాను. అంతలో, 'పెరట్లో ఉన్న నీళ్ళ బావి చుట్టూ వున్న గోడ దెబ్బతిన్నది. పాతగోడ పడగొట్టి కొత్త గోడ కట్టు,' అన్నాడు గురవయ్య. దానికి రెండు రోజులు పడు

వాణిశ్రీ

తుంది. నేను ఊరెళ్ళి మళ్ళీ వస్తాననీ, మొదట చేసినపనికి కూలీ కింద మాట్లాడుకున్న మూట బియ్యం ఇవ్వమనీ అడిగాను. అందుకు గురవయ్య ఒప్పుకోలేదు. దాంతో నాకు కోపం వచ్చి దుకాణంలో వున్న బియ్యం మూట ఎత్తుకుని పోతూంటే గురవయ్య, 'దొంగ, దొంగ' అని కేకలు పెట్టాడు. ఈ నలుగురూ వచ్చి నన్ను పట్టుకుని కొడుతూంటే కొత్వాలు గారు చూసి విడిపించారు,'' అని వీరయ్య జరిగినదంతా వివరంగా చెప్పాడు.

''గురవయ్యా, వీరయ్య చెప్పినది నిజమేనా?'' అని అడిగాడు న్యాయాధికారి.

''నా దుకాణం నుంచి వీరయ్య దౌర్జన్యంతో బియ్యం మూటను దొంగిలించడం నిజం!'' అన్నాడు గురవయ్య ఆవేశంగా.

''మరి, వాడు వారం రోజులు చేసిన పనికి మాట్లాడుకున్న కూలీ ఇవ్వక పోవడం నీ తప్పుకాదా?'' అని అడిగాడు న్యాయాధికారి.

''ఇవ్వనని నేను చెప్పలేదు. పని పూర్తిచేస్తే ఇస్తానన్నాను, అంతే,'' అన్నాడు గురవయ్య.

''మొదట మాట్లాడుకున్న పనిచేశాక కూడా ఇస్తానన్న బియ్యంమూట ఇవ్వకుండా అదనపు పని పురమాయించడం నీది నేరమే. అందుకు పది వరహాలు జరిమానా విధిస్తున్నాను,'' అన్న న్యాయాధికారి, వీరయ్యకేసి తిరిగి, ''గురవయ్య ఇస్తానన్న కూలీ ఇవ్వకపోతే అధికారులకు చెప్పుకోవాలే తప్ప, దౌర్జన్యంతో బియ్యం మూటను ఎత్తుకెళ్ళడం నీ నేరం. అందుకు శిక్షగా నువ్వు ఊరెళ్ళి తిరిగి వచ్చి, ఆ బావిగోడ కట్టి పూర్తి చేయాలి. అప్పుడు మూట బియ్యం, గురవయ్య చెల్లించే పదివరహాలు నువ్వు తీసుకోవచ్చు,'' అన్నాడు.

వీరయ్య సరేనన్నట్టు తలాడించాడు. ఆ తరవాత న్యాయాధికారి, ''గురవయ్య దొంగ అని అరవగానే నిజానిజాలు తెలుసుకోకుండా వీరయ్యను కొట్టినందుకు ఈ నలుగురికీ వారం రోజులు కారాగార శిక్షవిధిస్తున్నాను. ఇలా ఎవరికి వారు తొందరపడి చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకుంటే మళ్ళీ నేరాలు పెరిగిపోయి, న్యాయవ్యవస్థ అస్తవ్యస్తమై పోయే అపాయం ఉంది. దాన్ని మొదటే అరికట్టాలి,'' అన్నాడు.

న్యాయాధికారి తీర్పు విని అందరూ చప్పట్లు కొట్టారు.





# రాకాసిలోయ

## 30

[పులుగురాయుడి రెక్కలమనుషులకు కేశవుడూ, అతడి అనుచరులూ దొరికిపోయారు. కాని, ఆ రాత్రి కేశవుడూ వాళ్ళు వున్న గుడారంలోకి, బిడాలి శ్వానకర్ణి ముఠాల అడవి మనుషులిద్దరు ప్రవేశించారు. గుడారం ముందు కావలి వున్న జిత, శక్తివర్మలు లోపలికి అనుమతించినప్పటికీ వెంటనే అనుమానించి వాళ్ళను గుర్తించి కత్తులు దూసి, ''ఆగండి!'' అంటూ మీదికి వెళ్ళారు. -తరవాత]

శక్తివర్మ కత్తి దూసి ముందుకు వెళ్ళటం చూస్తూనే జితవర్మ కూడా కత్తి తీసుకుని అడవి మనుషుల దారిని అడ్డగించాడు. కాని, అడవి మనుషులిద్దరూ వాళ్ళను తమ చేతులతోనే పక్కకు నెట్టుతూ, ''పెద్దగా గోల చేయకండి. పులుగురాయుడు ఈ ముగ్గురు దుర్మార్గుల్నీ రహస్యంగా తన వద్దకు తీసుకు రమ్మన్నాడు. ఈ సంగతి పక్క గుడారంలో వున్న బ్రహ్మదండి మాంత్రికుడికీ, స్థూలకాయుడికీ తెలియకూడదు,'' అన్నారు.

ఆ మాటలతో జిత, శక్తివర్మలు ముఖముఖాలు చూసుకున్నారు. వాళ్ళిద్దరికీ అడవిమనుషుల ప్రవర్తన ఆశ్చర్యం కలిగించింది. శక్తివర్మ కత్తి వరలో పెట్టబోయినవాడల్లా ఆగి, చిన్న గొంతుతో, ''పులుగురాయుడు ఈ ముగ్గురు హంతకుల్నీ తన దగ్గిరికి తీసుకు రమ్మని మిమ్మల్ని పంపితే, తీసుకుపొండి, మా అభ్యంతరం ఏమీలేదు. కాని, మీ ముఖకవళికలు చూస్తూంటే, మీరు రెక్కల మనుషుల జాతి వాళ్ళలా లేరే?'' అన్నాడు.

'చందమామ'



శక్తివర్మ ఇలా అనగానే అడవి మనుషుల్లో ఒకడు నవ్వి, ‘‘అదా మీ అనుమానం. ఒక పని కలిగి, మేం కావాలనే అడవిమనుషుల తలలు తగిలించుకున్నాం. ఛీ, దారి తొల గండి! మీ ఇద్దరూ పరమ శుంఠల్లా వున్నారు,’’ అన్నాడు ముందుకు పోబోతూ.

జితవర్మ తోక తొక్కిన పాములా ఎగిరిపడి, కత్తితో అడవిమనిషి మీదికి దూకబోయాడు. అంతలో కేశవుడు అతడి కాళ్ళు రెండూ పట్టుకుని వెనక్కు గుంజటంతో ముందుకు బోర్లా పడిపోయాడు. మరు క్షణంలో కోయ గోమాంగ్, శక్తివర్మను పట్టుకుని ముందుకు పడదోశాడు.

జయమల్లు ఒక తాడుతో వాళ్ళిద్దర్నీ సమీపించి, ‘‘కిక్కురుమన్నారో, మీ ఇద్దరి ప్రాణాలూ నిలువునా తీసేస్తాం. చచ్చినట్టు పడివుండండి,’’ అంటూ హెచ్చరించి, తాడుతో ఇద్దరి చేతులూ కాళ్ళూ కలియ కట్టాడు. అంతలో పక్కన వున్న గుడారం నుంచి బ్రహ్మ దండి మాంత్రికుడి గొంతు వినబడింది.

‘‘ఇక్కడ జరిగిన గొడవేదో బ్రహ్మదండి పసికట్టినట్టుంది. ఇక మనం పారిపోవటమే క్షేమం,’’ అంటూ జయమల్లు హడావుడిగా గుడారంలో కనిపించిన ఆయుధాలు తీసు కున్నాడు.

ఆ సరికి బ్రహ్మదండీ, స్థూలకాయుడూ కూడా పెద్దగా గావుకేకలు ప్రారంభించారు: ‘‘ఆ దుర్మార్గులు ముగ్గురూ జిత, శక్తివర్మలను చంపి పారిపోచూస్తున్నారు. ఓ పులుగు రాయా! రండి, గుడారాన్ని తక్షణమే చుట్టు ముట్టండి.’’

ఆ కేకలు వింటూనే జయమల్లు గుడారం ద్వారం దగ్గిర ఆగి, అడవిమనుషులను, ‘‘మీ ఇద్దరూ లోపలికి రావటం చూస్తూనే మీ రెవరైందీ పోల్చుకున్నాం. లోగడ మిమ్మల్ని బిడాలి, శ్వానకర్ణి వెంట చూశాం. మీ ముఠాల వాళ్ళు పెద్ద బలగంతో ఇక్కడికి దాడి వస్తు న్నారా?’’ అని అడిగాడు.

‘‘అలాంటిదేమీ లేదు. మీరెలా వున్నారో చూసి రమ్మని మా నాయకులు మమ్మల్ని పంపారు,’’ అన్నాడొక అడవిమనిషి.

కేశవుడు గుడారం నుంచి బయటికి వెళ్ళి, బ్రహ్మదండి మాంత్రికుడున్న చోటు కేసి ఓమారు చూసి, జయమల్లుతో ఏదో చెప్ప బోయేంతలో, స్థూలకాయుడు కొరడా ఝుళి పిస్తూ అటుకేసి రాసాగాడు. అది గమనిస్తూనే కోయగోమాంగ్ కత్తి దూసి అతడి మీదికి ఉరకబోయేసరికి, వాడు పెద్దగా బొబ్బలు

పెడుతూ వెనుదిరిగి, ''ఆ క్రూరులు ముగ్గురికి తోడుగా మరిద్దరు రెక్కల మనుషులు చేరారు. స్వామి ద్రోహం, పులుగురాయా, స్వామి ద్రోహం!'' అంటూ పరిగెత్తాడు.

జయమల్లు చుట్టూ ఓమారు కలయ చూశాడు. ప్రతి గుడారం ముందూ రెక్కల మనుషులు గుంపులుగా చేరుకున్నారు. కొందరు, ''మోసం, స్వామి ద్రోహం!'' అంటూ అటూ ఇటూ పరిగెత్తుతూ, ఎదురైన వాళ్ళకు ఏమో చెపుతున్నారు.

''కేశవా, గోమాంగ్! మనం పారిపోయేందుకు ఒకే ఒక ఉపాయం నాకు తోస్తున్నది. ఈ సరికే మన శత్రువులందరికీ, మనం గుడారంలో నుంచి తప్పించుకు బయటపడినట్టు తెలిసిపోయింది. వాళ్ళు క్షణాల మీద మనను పట్టుకునేందుకు ఇక్కడికి వస్తారు. మనం ఎక్కడ వున్నదీ, ఎటు పారిపోతున్నదీ వాళ్ళకు తెలియకుండా తికమక పెట్టేందుకు ఆ వెలుగుతున్న కాగడాలు తీసుకుని, సాధ్యమైనన్ని గుడారాలకు నిప్పు పెడదాం. ఆ మంటల వల్ల బయలుదేరే గందరగోళంలో మనం తప్పించుకుని పారిపోవచ్చు,'' అన్నాడు జయమల్లు.

జయమల్లు మాట ముగించే లోపలే కేశవుడూ, గోమాంగ్, అడవి మనుషులిద్దరూ భగభగమండే కాగడాలు తీసుకుని, ''మోసం, స్వామి ద్రోహం!'' అని అరుస్తూ, పైకీ కిందికీ గెంతుతూ అందుబాటులో వున్న గుడారాలన్నిటికీ నిప్పు పెట్టారు. క్షణాల మీద అవి అంటుకుని భుగభుగ మంటూ మంటలు లేచినై.




బ్రహ్మదండి మాంత్రికుడూ, స్థూలకాయుడూ ఆ మంటలు చూస్తూనే తారెత్తిపోయారు. బ్రహ్మదండి మంత్రదండాన్ని పైకెత్తి, ''హా కాలభైరవా! నాకు అగ్నిస్నానం రాసి పెట్టావా? నీ భక్తుణ్ణి పరీక్షిస్తున్నావా?'' అంటూ మంటలను తప్పుకుని పరిగెత్తుతూ, స్థూలకాయుడితో, ''వీర కంఠీరవా! నీ ప్రతాపం చూపటానికి ఇదే అదను. ఆ దుర్మార్గులు ఎటు పారిపోతున్నారో కనిపెట్టి వుండు. నేను ఆ పిట్టతల వెధవను నిద్ర లేపుతాను,'' అని చెప్పి, పులుగురాయుడు వుండే గుడారాని కేసి దౌడుతీశాడు.

బ్రహ్మదండి హడావిడిగా తన కేసి పరిగెత్తి రావటం చూస్తూనే, పులుగు రాయుడు పెద్దగా నవ్వి, ''ఏం, మాంత్రికా! ఒళ్ళూ పై తెలియకుండా డేగలా ఎగిరి వస్తున్నావ్, ఏమిటీ కథ?'' అని అడిగాడు.



''ఏమిటీ కథ? ఏం, పులుగు ప్రభో! మనందరి కేమన్నా మతులు పోయినయ్యా? ఆ దుర్మార్గులు మన గుడారాలకు నిప్పు పెట్టి పారిపోతూంటే, మీరు నవ్వుతూ ఇక్కడ కూచున్నారు? పైగా, మీ సహచరుల్లోనే కొందరు నీచులు స్వామిద్రోహులై, ఆ దుర్మార్గులతో హాయిగా కలిసిపోయారు,'' అన్నాడు బ్రహ్మదండి.

''ఆ స్వామిద్రోహుల్నీ, ఆ పాపాత్ములు ముగ్గుర్నీ వలవేసి కొంగల్ని పట్టినట్టుగా పట్టి తెచ్చేందుకు నా అనుచరుల్ని ఎప్పుడో పంపాను. నువ్వేమీ హడావిడి పడక సావధానంగా కూచో. నీ అంగరక్షకులు జిత, శక్తి వర్మలెక్కడ? ఆ ఎనుబోతు బానిసల యజమాని ఏమయ్యాడు? వాళ్ళూ ఆ దుర్మార్గులతో కలిసి పారిపోయే ప్రయత్నంలో లేరుకదా?'' అన్నాడు పులుగురాయుడు.

బ్రహ్మదండి ఆ ప్రశ్నతో గతుక్కుమని, ''అలాంటిదేమీ జరగదు, పులుగు దొరా! వాళ్ళూ నీ అనుచరుల వెంట ఆ ద్రోహుల్ని పట్టి తెచ్చేందుకు వెళ్ళివుంటారు,'' అన్నాడు.

అంతలో నలుగురైదుగురు రెక్కల మనుషులు అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చారు. వాళ్ళను చూస్తూనే, పులుగురాయుడు, ''ఆ ముగ్గురు దుర్మార్గులూ దొరికారా? స్వామిద్రోహం చేసిన దుర్మార్గు లెంతమంది?'' అని ప్రశ్నించాడు.

రెక్కల మనుషుల్లో ఒకడు తమ నాయకుడికి వంగి వంగి దణ్ణాలు పెట్టి, ''పులుగు దొరా! వాళ్ళు మొత్తం అయిదుగురు. వాళ్ళు మన వాళ్ళల్లో కొందరిని చంపారు. మన చక్రబంధం నుంచి బయటపడి మొసళ్ళ మడుగు కేసి పారిపోతున్నారు,'' అన్నాడు.

''అలా అయితే మన పని మరీ తేలికైనట్టే. వాళ్ళు మొసళ్ళ మడుగును చుట్టి పారిపోకుండా దారి అటకాయించండి. మడుగులో దిగి పారిపోయే ప్రయత్నం చేశారో, అందర్నీ మడుగులోని మొసళ్ళు భక్షించి వేస్తయ్. ఒడ్డున ఆగితే, మనం వేసిన వలలో చిక్కుకుంటారు. అదీ, మన ఎత్తుగడ! అర్థమైందా? ఇక వెళ్ళండి,'' అన్నాడు పులుగురాయుడు.

''ఆ కేశవుణ్ణి మాత్రం మొసళ్ళు తినకుండా చూడాలి, పులుగేంద్రా! వాడు చచ్చేందుకు వీలులేదు. రాకాసిలోయలోని ధనరాసుల కన్నిటికీ వాడే వారసుడు,'' అంటూ బ్రహ్మదండి మాంత్రికుడు గోల ప్రారంభించాడు.

పులుగురాయుడు ఆ మాట లేవీ విననివాడిలా లేచి నిలబడి, తన అనుచరులతో, ''పదండి, వాళ్ళు మొసళ్ళ వాత బడ్డారో, మనవాళ్ళచేత చిక్కారో చూద్దాం,'' అంటూ బయలుదేరాడు. బ్రహ్మదండి అతణ్ణి అనుసరించాడు.

పులుగురాయుడు మొసళ్ళ మడుగు ప్రాంతం చేరేసరికి, ఆ ప్రదేశమంతా అటూ ఇటూ పరిగెత్తే వాళ్ళతో, కేకలుపెట్టే వాళ్ళతో గొడవగా వున్నది. అతడు తన అనుచరుల్లో ఇద్దరు ముగ్గుర్ని దగ్గిరకు పిలిచి, ''ఏమయింది? వాళ్ళు మన వలనుంచి తప్పుకు పారిపోలేదుగదా?'' అని ప్రశ్నించాడు.

''లేదు, దొరా! వాళ్ళను ఉచ్చులో బిగించేందుకు చుట్టూ కమ్ముకుంటూ వచ్చాం. వాళ్ళు మరెటు పోయేందుకూ దారిలేక, మొసళ్ళ మడుగు అంచున వున్న పొదల్లోకి దూరారు. ఇక మనం వాళ్ళను వెతికి, వాటి మధ్య నుంచి కుందేళ్ళను లాగినట్టు బయిటికి లాగటమే మిగిలివుంది,'' అన్నాడొకడు.

''భేష్, మహ బావుంది. ఆ పని కాస్తా అయిందనిపించండి,'' అంటూ పులుగురాయుడు ఎగిరి ఒక చెట్టు మోడు మీద నిలబడ్డాడు. అతడి అనుచరులు కాగడాలతో పొదలన్నీ వెతుకుతూ ముందుకు కదిలారు.

అదంతా చూస్తున్న బ్రహ్మదండికి, కేశవుడు దుస్సాహసంతో మొసళ్ళ మడుగులో దూకి పారిపోయే ప్రయత్నం చేస్తాడేమో అనిపించింది. ఆ వెంటనే అతడు పెద్దగా గొంతెత్తి, ''వత్సా, కేశవా! నీకొచ్చిన ప్రాణభయం ఏమీ లేదు. నీ వెంట వున్న ఆ ద్రోహుల్ని వదిలి, ఇటు వచ్చెయ్యి. దయామయుడైన పులుగురాజేంద్రుడు నిన్ను తప్పక క్షమిస్తాడు,'' అని కేకపెట్టాడు.

బ్రహ్మదండి పెట్టిన కేకకు జవాబుగా అన్ని వైపుల నుంచీ, ''బిడాలికీ జై! శ్వానకర్ణికీ జై!''



అన్న భీకరమైన నినాదాలు మార్మోగినై. ఆ వెంటనే పొడవైన ఈటెలు బయ్ మంటూ వచ్చి రెక్కల మనుషులమీద పడసాగినై.

పులుగురాయుడు మోడు మీది నుంచి కిందికి దూకుతూ, ''ఆ అడవిమనుషులు మన చక్రబంధానికి చుట్టూ చక్రబంధం బిగించారు. లాభంలేదు, పరిగెత్తండి, ఆకాశంలోకి గరుడపక్షుల్లా లేవండి,'' అంటూ వెనుదిరిగి కాలి బలం కొద్దీ పరిగెత్తసాగాడు. బ్రహ్మదండి కూడా అతడి వెనక పరిగెత్తుతూ, ''జితా, శక్తీ! ఎక్కడ?'' అని అరవసాగాడు.

రెక్కలమనుషుల గుడారాలు నిప్పంటుకుని మండిపోవటం చూసిన బిడాలీ, శ్వానకర్ణీ, ఇదే మంచి తరుణం అనుకుని, తమ ముఠావాళ్ళతో వచ్చి రెక్కల మనుషుల మీద పడ్డారు. మొదట విసిరిన ఈటె దెబ్బలకే హడలుకుని రెక్కల మనుషులు పారిపోయే ప్రయత్నం చేయటంతో వాళ్ళకు ఎక్కడలేని ధైర్యం కలిగింది. కాని, వాళ్ళకు కేశవుడూ అతడి అనుచరులెక్కడ వున్నదీ తెలియ లేదు. ఆ కారణం వల్ల తాము విసిరే ఈటెలు ఒక వేళ వాళ్ళకు తగిలినా తగలవచ్చన్న అనుమానం శ్వానకర్ణికీ, బిడాలికీ కలిగింది. ఆ వెంటనే వాళ్ళు తమ అనుచరులకు ఈటెలు విసర వద్దని ఆజ్ఞాపించి, గొంతులెత్తి, ''కేశవా, జయమల్లూ! మీ రెక్కడ వున్నారు?'' అంటూ కేకలు వేశారు.

బిడాలీ, శ్వానకర్ణీ పెట్టిన కేకలు, మొసళ్ళ మడుగు అంచున గల పొదల్లో దాగివున్న కేశవుడి అనుచరులకూ, వారివెంట వున్న అడవిమనుషులకూ వినబడినై. కాని, వాళ్ళు జవాబిచ్చే లోపలే కొందరు రెక్కల మనుషులు అటుగా వచ్చి, వాళ్ళ మీద కలియబడ్డారు.

కేశవుడూ వాళ్ళకు తమ కత్తులు ఉపయోగించే అవకాశం కలగలేదు. ఒక వైపున మొసళ్ళతో నిండి వున్న మడుగూ, రెండవ వైపున చెట్ల పొదలూ – ఆ పరిస్థితిలో వాళ్ళు అన్నిటికీ తెగించి, రెక్కల మనుషుల మీద ముష్టాముష్టి యుద్ధానికి దిగారు.

ఈ పోరాటంలో బలంగా దెబ్బలు తిన్న వాళ్ళు మడుగులో పడసాగారు. కేశవుడూ, గోమాంగ్ కూడా రెండుసార్లు మడుగులో పడి, తిరిగి క్షణాల మీద ఒడ్డు చేరి, రెక్కల మనుషుల్ని అందులోకి నెట్టసాగారు. దూరంగా బిడాలీ, శ్వానకర్ణీ పెట్టే కేకలు వాళ్ళకు వినబడుతూనే వున్నవి. –(ఇంకావుంది)





# గుణశేఖరుడి కథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, దేనిని సాధించాలన్న తీవ్ర కాంక్షతో భీతి కొల్పే ఈ శ్మశాన వాతావరణంలో నువ్వు ఇలా శ్రమపడుతున్నావో నాకు తెలియదు. అయితే, వేటి పట్లా కాంక్ష లేకుండా నిర్లక్ష్యంగా ఉపేక్ష భావంతో వ్యవహరించే కొందరు ఒక్కొక్కసారి మనసు మార్చుకుని, అద్భుత విజయాలను పోరాడుతూన్న వారికి దక్కకుండా అపహరించుకు పోతూంటారు. అలాంటి ఆశాభంగానికి గురికాకుండా తగు జాగ్రత్తగా ముందు హెచ్చరికతో ఉండగలందుకు వీలుగా నీకు ఇద్దరు రాకుమారుల కథ చెబుతాను, శ్రమ

బేతాళ కథలు



తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్ప సాగాడు:

విరాగ దేశాన్నేలే చంద్రశేఖరుడికి ఇద్దరు కవలలు కలిగారు. పెద్దవాడు కులశేఖరుడు, చిన్న వాడు గుణశేఖరుడు. అల్లారు ముద్దుగా పెరిగే ఆ బాలకులకు వయసొక్కటే అయినా రూపురేఖల్లో, ప్రవర్తనలో విభిన్నంగా ఉండే వారు. పెద్దవాడు కులశేఖరుడు చిన్నప్పటి నుంచీ తనే రాజన్నట్టు మసిలేవాడు. చిన్న వాడు గుణశేఖరుడు అందుకు భిన్నంగా దాస దాసీ జనాన్ని కూడా తనతో సమానంగా చూసేవాడు. తాత రాజశేఖరుడు వాళ్ళిద్దరికీ రాజవంశానికి సంబంధించిన వీరోచిత గాథలు చెబితే-గుణశేఖరుడు కథ విని సంతోషించి ఊరుకునేవాడు. కులశేఖరుడు ఎంతగానో ఉద్రేకపడి తను పెరిగి పెద్దవాడై అంతకంటే గొప్ప గొప్ప సాహస కార్యాలు చేస్తానని బీరాలు పలికేవాడు.

యేటా చంద్రశేఖరుడు తనయుల పుట్టిన రోజును ఘనంగా జరిపించేవాడు. అలా వారి పదవ పుట్టిన రోజు వేడుకలకు సుప్రసిద్ధ గురువు శంభునాధుడు, తన శిష్యుల ద్వారా జీవకళ ఉట్టిపడే గరుడపక్షి బొమ్మను కానుకగా పంపాడు. దాని వీపుమీద ఒక మనిషి కూర్చునేందుకు సరిపడా చోటుంది. కూర్చుని మెడ దగ్గరి మీట నొక్కితే ఆ మరబొమ్మ కొంత దూరం ముందుకు పోయి, ఆ తరవాత పదడుగుల ఎత్తుకు ఎగిరి కాస్సేపు తిరిగి కిందికి దిగుతుంది.

అన్నదమ్ములిద్దరూ ఆ బొమ్మను తీసుకుని ఉద్యానవనానికి వెళ్ళారు. ఆ మరబొమ్మ విన్యాసాలు చూడడానికి అక్కడికి అంతఃపుర స్త్రీలందరూ వచ్చారు. ముందు కులశేఖరుడా మరబొమ్మ మీద కూర్చుని కొంతసేపు గాలిలో తిరిగాడు. దానిని చూసిన అంతఃపురదాసి కొడుకు శరభుడు ఆ బొమ్మ మీద కూర్చోవాలని తల్లిని అడిగాడు. ఆ ఆశ తప్పని తల్లి వాణ్ణి మందలించింది. గుణశేఖరుడది గమనించి శరభుడితో, ''నువ్వూ నా ఈడువాడివే. నీ కోరిక తప్పుకాదు. అన్న నాకు బొమ్మనిచ్చాక ముందు నువ్వే దాని మీద కూర్చుందువు గాని,'' అని చెప్పాడు.

కాస్సేపటికి కులశేఖరుడు మరబొమ్మను తమ్ముడికిచ్చాడు. అప్పుడు గుణశేఖరుడు శరభుణ్ణి దాని మీద కూర్చోమన్నాడు. వెంటనే కులశేఖరుడు రాకుమారుల బొమ్మపై సేవ



కులు కూర్చోరాదన్నాడు. తల్లిదండ్రులు, తాత అన్ననే సమర్థించడంతో, ''శరభుడు ఈ బొమ్మ మీద కూర్చోకూడదంటే, నాకూ అది వద్దు; దానిని తయారు చేసిన శంభునాథుడి శిష్యరికం చేసి, ఇలాంటి బొమ్మ తయారు చేయడం నేర్చుకుంటాను,'' అని గుణశేఖ రుడు అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

శంభునాథుడి పేరు వినగానే తన పిల్లలకు రాజోచిత విద్యలు నేర్పడానికి ఆయనే తగిన గురువని చంద్రశేఖరుడికి తోచింది. ఆయన తనయులను శంభునాథుడి గురుకులాశ్ర మానికి పంపాడు. వారి రాకకు సంతోషించిన గురువు, వారికి అన్నివిద్యలూ నేర్పసాగాడు. గుణశేఖరుడు రాజోచిత విద్యలతో పాటు, మరబొమ్మ చేసే శిల్పశాస్త్రం కూడా నేర్చుకు న్నాడు. యేడాది తిరిగేలోగా స్వయంగా ఒక గరుడపక్షి బొమ్మను తయారు చేశాడు. రాజధానికి కబురంపి శరభుణ్ణి రప్పించి, గురుకులాశ్రమంలో వాణ్ణి గరుడపక్షి మీద కూర్చోబెట్టి, గాలిలో విన్యాసాలు చేయించి వాడి కోరిక తీర్చిపంపాడు. అన్న అభ్యంతరం చెబితే, ''ఇది రాజకుమారుల కోసం ఎవరో చేసిన బొమ్మ కాదు. శరభుడికోసం నేను స్వయంగా చేసిన బొమ్మ,'' అని బదులి చ్చాడు. గుణశేఖరుడి ఆంతర్యం గ్రహించిన శంభునాథుడు, ''నువ్వు సాధారణ మానవు డివి కాదు. భవిష్యత్తులో ఎంతో గొప్పవాడివవు తావు,'' అని అభినందించాడు.

గురుకులంలో జరిగేవన్నీ చంద్రశేఖరుడికి ఎప్పటికప్పుడు తెలుస్తూనే ఉన్నాయి. కుమారులకు పదేళ్ళ విద్యాభ్యాసం పూర్త య్యాక, ఆయన గురుకులాశ్రమానికి వెళ్ళి గురువును దర్శించి, ''కులశేఖరుడిలో వున్న రాజలక్షణాలు గుణశేఖరుడిలో లేవు. ఈ విషయమై మీరేమైనా చేయగలిగారా?'' అని అడిగాడు.

శంభునాథుడు మందహాసం చేసి, ''కుల శేఖరుడు దేశానికి కాబోయే మహారాజు. తనకు రాజయ్యే అవకాశం లేదు గనక, గుణ శేఖరుడు అలా ఉన్నాడని నా అనుమానం,'' అన్నాడు.

కుమారులతో రాజధానికి తిరిగివెళ్ళాక చంద్రశేఖరుడు తండ్రిని కలుసుకుని, ''గుణ శేఖరుడు రాజ్యార్హత లేదని చిన్నబుచ్చుకుం టున్నాడు. అది నాకు దుస్సహంగా ఉన్నది. రాజ్యాన్ని రెండు భాగాలుగా చేసి ఇద్దర్నీ చెరో



భాగం ఏలుకోమనడం సమంజసమని నాకు తోస్తున్నది,'' అన్నాడు.

''వారసత్వంగా లభించిన ఈ రాజ్యాన్ని మనకు ఏలుకునే హక్కే తప్ప, విభజించే హక్కులేదు. కావాలంటే నువ్వు వేరే దేశం మీద దండెత్తి ఆక్రమించు. దానికి గుణశేఖరుణ్ణి రాజును చెయ్యి,'' అని తండ్రి సలహా ఇచ్చాడు.

ఈ ఉపాయం నచ్చిన చంద్రశేఖరుడు, పొరుగునే ఉన్న విరూపదేశంపై దండయాత్రకు సన్నాహాలు ప్రారంభించాడు. అది తెలిసిన గుణశేఖరుడు తండ్రిని కలుసుకుని, ''విరూప దేశం మనకే అపకారమూ తలపెట్టలేదు. యుద్ధం అంటే ఇరు దేశాల పౌరులకూ ధన మాన ప్రాణ నష్టం. నాకు రాజ్యకాంక్ష లేదు. నాకోసం మీరీ అన్యాయానికి పాల్పడవద్దు,'' అని వేడుకున్నాడు. సరేనని చంద్రశేఖరుడు యుద్ధ ప్రయత్నాలు ఆపేశాడు.

ఆ సమయంలో విశాలదేశపురాజు వీరగుప్తుడు తన ఏకైక పుత్రిక చంద్రకళకు స్వయంవరం ప్రకటించాడు. కులశేఖరుడా స్వయంవరానికి వెళ్ళాలనుకున్నాడు. కానీ తల్లి అతణ్ణి వారించి గుణశేఖరుణ్ణి వెళ్ళమన్నది. చంద్రకళను వివాహమాడితే గుణశేఖరుడు విశాలదేశానికి రాజుకావచ్చునని ఆమె ఆశ. అయితే, గుణశేఖరుడు తల్లితో, ''స్వయంవరంలో గెలుపు నా సామర్థ్యం మీద కాక, చంద్రకళ ఇష్టాయిష్టాల మీద ఆధారపడి ఉంటుంది. అలాంటి పోటీ నా కిష్టం లేదు,'' అని స్వయంవరానికి వెళ్ళడానికి నిరాకరించాడు. కులశేఖరుడు, ''స్వయంవరం రాచరికపు సంప్రదాయం,'' అని స్వయంవరానికి బయలుదేరి వెళ్ళాడు.

ఆ స్వయంవరానికి వివిధ దేశాల నుంచి రాకుమారులు వచ్చారు. చంద్రకళ వరమాలతో స్వయంవర మంటపానికి రాగానే హఠాత్తుగా అక్కడ ఒక యువకుడు ప్రత్యక్షమై, ''నా పేరు మిత్రవిందుడు. నేనిప్పుడు చంద్రకళను నాతో మహాపర్వతానికి తీసుకువెళుతున్నాను. మీలో చేవ ఉన్నవారు అక్కడికి వచ్చి నన్ను ఓడించి ఈమెను వెనక్కు తీసుకువెళ్ళండి,'' అంటూ చంద్రకళతో సహా అక్కడి నుంచి మాయమయ్యాడు.

నివ్వెరపోయిన రాజు వీరగుప్తుడు, తన కుమార్తెను రక్షించి తెచ్చినవారికి, ఆమెనిచ్చి పెళ్ళి చేసి తన రాజ్యాన్నప్పగిస్తానని ప్రకటిం

చాడు. అది వింటూనే స్వయంవరానికి వచ్చిన వారందరూ మహాపర్వతానికి బయల్దేరారు. అలా వెళ్ళినవారు ఒక్కొక్కరుగా హతుల య్యారనీ, వారిలో కులశేఖరుడు కూడా ఉన్నాడనీ విరాగదేశానికి కబురు వెళ్ళింది. అది విన్న గుణశేఖరుడు- తల్లిదండ్రులు, తాత వారించినా వినకుండా బయలుదేరి ముందుగా గురుకులాశ్రమానికి వెళ్ళి గురువు శంభునాథుణ్ణి చూసి మిత్రవిందుడి వివరాలు తెలుసుకున్నాడు.

మిత్రవిందుడు విశాలదేశపు మంత్రి కుమారుడు. యువరాణి చంద్రకళను వివాహమాడినవాడు చక్రవర్తి కాగలడన్న రహస్యం గ్రహించి, తండ్రి ప్రోద్బలంతో పదిహేనవయేట నుంచే పలు మంత్రశక్తులు సాధించాడు. మహాపర్వతం మీది రుధిరభైరవిని ఉపాసిస్తున్నాడు. చక్రవర్తి కావాలన్న అతడి కోరికను తీర్చడానికి-రుధిరభైరవి వందమంది వీర కుమారుల బలిని కోరి అందుకు కొన్ని ప్రత్యేక శక్తులనిచ్చింది. భూమ్మీది ఏ మామూలు ఆయుధమూ, ప్రాణీ మిత్రవిందుణ్ణి హత మార్చలేవనీ-మనిషికాని మనిషి ద్వారా ఆయుధంకాని ఆయుధం చేత మాత్రమే అతడు విగత జీవుడు కాగలడనీ తెలుసుకున్న గుణశేఖరుడు గురువు దీవెనలందుకుని మహాపర్వతం చేరాడు.

అక్కడ మిత్రవిందుడు, చంద్రకళ కనిపించారు. గుణశేఖరుడు రుధిరభైరవీ విగ్రహానికి నమస్కరించి, విగ్రహం చేతిలోని శూలాన్ని అందుకుని ఒక్క పోటుతో మిత్రవిందుణ్ణి



భైరవి పాదాలకు బలి ఇచ్చాడు. అప్పటికే రుధిరభైరవికి తొంభైతొమ్మిది మంది వీర యువకులు బలి అయ్యారు. మిత్రవిందుడు నూరవ వాడయ్యాడు. తక్షణమే రుధిరభైరవి ప్రత్యక్షమై, ''అపూర్వమైన నీ ధైర్యానికి మెచ్చాను. ఏదైనా వరం కోరుకో,'' అన్నది.

గుణశేఖరుడు రుధిరభైరవికి చేతులు జోడించి బలియైన నూరుగురుయువకులనూ బ్రతికించమన్నాడు. భైరవి వాళ్ళందరినీ బ్రతికించి, ''ఈ మనిషికాని మనిషి గుణశేఖరుడి కారణంగా మీరు పునర్జన్మనెత్తారు. ఇతడు చంద్రకళను వివాహమాడి విశాలదేశానికి రాజవుతాడు. మీరందరూ సామంతులై ఇతణ్ణి చక్రవర్తిలా సేవించుకోండి,'' అన్నది.

ఇది విని అందరూ గుణశేఖరుడికి కృతజ్ఞతలు చెప్పారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, తొలి నుంచీ రాజలక్షణాలూ, రాజ్యకాంక్షా లేని; తల్లి చెప్పినా చంద్రకళ స్వయంవరానికి వెళ్ళ నన్న గుణశేఖరుడికి చంద్రకళనూ, చక్రవర్తి పదవినీ కట్టబెట్టడం న్యాయమా? వాటిని అతడు ఎలా అంగీకరించాడు? పైగా అతణ్ణి మనిషికాని మనిషి అంటూ రుధిరభైరవి ప్రశం సించడంలోని ఆంతర్యం ఏమిటి? ఈ సందే హాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''గుణశేఖరుడికి రాజలక్షణాలు లేవనడం సరైనది కాదు. ముందుగానే బయలుదేరిన అన్న కులశేఖరు డితో పోటీపడడం ఇష్టంలేక స్వయంవరానికి వెళ్ళనన్నాడు. తన కుమార్తెను రక్షించిన వారికి ఆమెనిచ్చి పెళ్ళిచేస్తానన్న వీరగుప్తుడి ప్రకటన తెలిసి కూడా రక్షించాడు కాబట్టి అతడామెను కాదన కూడదు. ఇక రాజలక్షణాలున్నవారు నాయకులు మాత్రమే కాగలరు. మనుషు లందరినీ సమభావంతో చూసేవారు చక్రవర్తు లవుతారు. అంతఃపుర దాసి కొడుకు కోరిక తీర్చడం కోసమే శిల్పవిద్యను నేర్చిన ఉదాత్త హృదయుడు గుణశేఖరుడు. కేవలం అన్న కోసమో, యువరాణి కోసమో కాకుండా తొంభైతొమ్మిది మంది వీర కుమారులను బ్రతికించడానికీ, ఒక దుర్మార్గుడి దురాగతా లను అరికట్టడానికీ, తన ప్రాణాలను లెక్క చేయకుండా అపూర్వ సాహసం ప్రదర్శించిన నిస్వార్థ యువకుడు గనకనే-రుధిరభైరవి అతణ్ణి మనిషి కాని మనిషి అంటూ ప్రశంసిం చింది. మనిషి అయినప్పటికీ మామూలు మనుషులకు ఉండే స్వార్థం, లోభం అతనిలో ఏమాత్రం లేవు. అతడు మానవాతీతుడు. ఆశయం ఉన్నతంగా ఉన్నప్పుడు పనిచేయని ఆయుధాలు కూడా పని చేయగలవని అతడు నిరూపించాడు. విశాలక్షేమం కాంక్షించే నిస్వార్థం ముందు సంకుచిత స్వార్థశక్తులు నిర్వీర్యమై పోతాయని నిరూపించిన ధీరుడు గుణశేఖరుడు. అందువల్లే చక్రవర్తి పదవి అతణ్ణి వరించింది,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : 'వసుంధర' రచన]





# మాయదారి జబ్బు

సారంగపట్నంలో ఆనందాచారికి ఒక పెద్ద బంగారు నగల దుకాణం ఉన్నది. ఆ దుకాణం ఆయనకు తాత తండ్రుల నుంచి సంక్రమించిన ఆస్తి కాదు. ఆయన కష్టార్జితం.

ఆయన చిన్నవయసులోనే తల్లిదండ్రులు చనిపోతే, జీవనోపాధికి ఒక నగల దుకాణంలో పనికి కుదిరాడు. నిజాయితీగా కష్టపడి పని చేస్తూ యజమాని విశ్వాసానికి పాత్రుడయ్యాడు. పదేళ్ళపాటు తన యజమాని మాట్లాడే విధానం, పనిలోని మెళకువలు అన్నీ ఆకళింపు చేసుకున్నాడు.

ఆ తరవాత బయటికి వచ్చి, అంతవరకు పొదుపు చేసిన డబ్బుతో, స్వర్ణకారుల సహకారంతో పట్నంలో చిన్న నగల దుకాణం పెట్టాడు. ఆ దుకాణం దినదినాభివృద్ధి చెంది, ఐదు సంవత్సరాలలో ఆ పట్నంలోనే నాణ్యమైన దుకాణంగా పేరు తెచ్చుకున్నది.

ఆనందాచారికి బాగా ఉన్న ఇంటిఅమ్మాయి నాగావళి భార్యగా వచ్చింది. తోడుగా బోలెడంత ఆస్తి తెచ్చింది. దాంతో పనివాళ్ళ మీద పెత్తనం కూడా చలాయించసాగింది. డబ్బును బంగారు నాణాలుగా మార్చి రహస్యంగా దాచడం మొదలుపెట్టింది.

భర్త అంటే ప్రేమ ఉన్నప్పటికీ, ధనం మీది పేరాశకొద్దీ భర్తను ఓ క్షణం పాటు ఇంటిపట్టున ఉండనిచ్చేది కాదు. సూర్యోదయం ముందే నిద్రలేపి, స్నానపానాదులు, పూజ పూర్తిచేయించి దుకాణానికి పంపేది. మధ్యాహ్నభోజనానికి కూడా ఇంటికి రానివ్వకుండా, దుకాణానికే భోజనం పంపేది. ''ఈ కాలంలో ఎవరినీ నమ్మడానికి లేదండీ. అందరివీ దొంగ బుద్ధులు. మన జాగ్రత్తలో మనం ఉండాలి. రేపు మనకేదైనా అయితే ఎవరు ఆదుకుంటారు? పనివాళ్ళ మీద ఎప్పుడూ ఒక కన్ను

కోటమర్తి రాధా హిమబిందు



వేసి ఉంచండి,'' అంటూ భర్తకు పొద్దస్తమానం బాలపాఠాలు చెబుతూ ఉండేది.

వ్యాపారం పట్ల భార్యకున్న శ్రద్ధను చూసి మొదట ఆనందాచారి సంతోషించినప్పటికీ, రోజులు గడిచే కొద్దీ ఆమె పోరు వెగటు పుట్టించసాగింది. భార్యతో ఆ మాట చెప్పలేక మౌనంగా భరించసాగాడు. మరికొన్నాళ్ళకు ఆయనలో ఆనందం, తృప్తి అడుగంటిపోయి చెప్పరాని దిగులు చోటుచేసుకున్నది. దాన్ని గురించి ఆయన ఒకనాడు భార్యతో ప్రస్తావిస్తే, ''ఇదేంటండీ, ఈ మాయదారి జబ్బు! పట్నంలో ఈ రోజు బ్రహ్మాండంగా వెలుగుతున్న మీరు, అన్నీ పోగొట్టుకున్న అనాథలా దిగులు పడి పోతారెందుకు? అది సరే, నాతో మరో దుకాణం పెట్టిస్తానన్నారు కదా? దాని మాటేమయింది?'' అని మాట మార్చింది నాగావళి.

ఆనందాచారి మరేమీ మాట్లాడలేక మౌనంగా ఉండిపోయాడు.

ఇలా ఉండగా ఆ ఊరికి ఒక సాధువు వచ్చి పట్నం పొలిమేరలో భక్తులకు దర్శనమిస్తూ, సమస్యలలో ఉన్నవారికి తగిన సలహాలు ఇస్తున్నాడని అందరూ చెప్పుకోసాగారు. ఒక నాటి సాయంకాలం ఆనందాచారి సాధువు దర్శనానికి వెళ్ళాడు. భక్తులందరూ వెళ్ళి పోయాక ఆనందాచారి సాధువు వద్ద తన బాధను చెప్పుకుని, ''జీవనోపాధికోసం మరో చోట పనిచేసినప్పుడే సంతోషంగా గడిపాను. ఇప్పుడేమో, కావలసినంత ఆస్తి ఉన్నది గాని, అప్పటి ఆనందం, తృప్తి కరువయ్యాయి స్వామీ,'' అన్నాడు విచారంగా.

మందహాసంతో అంతావిన్న సాధువు తల పంకిస్తూ, ''జీవితంలో ఎలాగైనా పైకి రావాలనే ఉత్సాహం ఆనాడు నీలో ఉండేది. అదే నీకు ఆనందాన్నిచ్చింది. ప్రస్తుతం అలాంటి లక్ష్యం లేదు. పదిమందికి సాయపడడానికి ప్రయత్నించు. ఆ సాయమేదో నీ దుకాణంలో పనిచేసే వారితో ప్రారంభించు. పదిమందికోసం జీవించడం నేర్చుకుంటే, మునుపటి ఆనందాన్ని మించిన జీవన మాధుర్యం నీకు తెలియవస్తుంది,'' అన్నాడు.

''నా భార్య అందుకు సమ్మతించాలికదా. ఆమెకు ధనవ్యామోహం ఎక్కువ,'' అన్నాడు ఆనందాచారి కాస్త సంకోచంగా.

''ధనం కన్నా విలువైనవి జీవితంలో చాలా ఉన్నాయని నీ భార్యకు అనుభవ పూర్వకంగా నువ్వే తెలియజేయాలి. తెలివిగల వ్యాపారివి.

ప్రేమగల భార్యలో అంత మాత్రం మార్పు తీసుకురావడం ఆలోచిస్తే కష్టం కాదను కుంటాను,'' అన్నాడు సాధువు మళ్ళీ నర్మ గర్భంగా నవ్వుతూ.

''చిత్తం స్వామీ,'' అంటూ ఆలోచనతో లేచి నమస్కరించిన ఆనందాచారికి విభూతి ప్రసాదం ఇచ్చి ఆశీర్వదించాడు సాధువు.

ఆ రోజు రాత్రి పడుకున్న ఆనందాచారి మంచం మీది నుంచి లేవలేదు. నాగావళి కంగారుతో వైద్యులను పిలిపించింది. పరీక్షలు చేసి చూసిన వైద్యులు ఆయనకు ఫలానా వ్యాధి అని నిర్ధారించలేక పోయారు. దూర ప్రాంతాల నుంచి పేరు మోసిన వైద్యులను పిలిపించింది. అయినా ఫలితం కనిపించ లేదు. ఆనందాచారి అన్నం తినడానికి బుద్ధి కాలేదంటూ ఏవో నాలుగు మెతుకులు తినే వాడు. భర్త నీరసించి పోవడంతో నాగావళికి భయం పట్టుకున్నది. భర్త ఆరోగ్యం బాగుపడా లని భక్తిశ్రద్ధలతో పూజలు ప్రారంభించింది. దేవుళ్ళందరికీ మొక్కుకున్నది. అయినా ఆనందాచారిలో ఎలాంటి మార్పూ కనిపించ లేదు. ఈ స్థితిలో భర్తను వదిలి వెళ్ళడానికి మనసురాక ఆమె దుకాణంకేసి వెళ్ళడం మానేసింది.

ఇలా ఉండగా కొన్నాళ్ళకు నాగావళి చిన తాతయ్య ఆమెను చూడడానికి వచ్చి, ''ఆలు మగలు మూడు నెలల పాటు తీర్థయాత్ర చేసిరండి. శుభం జరుగుతుంది,'' అన్నాడు.

ఆ స్థితిలో ఉన్న భర్తను తీర్థయాత్రలకు ఎలా తీసుకువెళ్ళడమా అని నాగావళి మొదట వెనుకాడింది. కాని తాతయ్య మాట మీది గురితో ఒక నౌకరును తోడు చేసుకుని



వెళ్ళాలని నిశ్చయించింది. అన్నాళ్ళు వ్యాపారమే సర్వస్వం అనుకున్న ఆమె, నగల దుకాణాన్ని పనివాళ్ళకు అప్పగించి తీర్థయాత్రలకు బయలుదేరింది.

మూడు నెలల తీర్థయాత్రలో ఆమె బయటి ప్రపంచాన్ని, రకరకాల మనుషులను చూసింది. దేవాలయాలలో జరిగే ప్రవచనాలను విన్నది. భర్త ఆరోగ్యం మెరుగవడంతో పాటు, ఆమె మనసు పరిపక్వం చెందింది. ఇంటికి తిరిగి వచ్చిన ఆమె దుకాణంలో ఎలాంటి ఇబ్బందులూ, పొరబాట్లూ లేకుండా వ్యాపారం మరింత బాగా జరగడం చూసి పరమానందం చెందింది.

ఒకనాడు నాగావళి భర్తతో, ''మన నగల దుకాణం చూసుకుంటూన్న బసవయ్య సమయానికి దేవుడిలా ఆదుకున్నాడండీ. అలాగే మన దగ్గర పనిచేసే వాళ్ళందరూ, మనం దుకాణానికి వెళ్ళకున్నా, దానిని సక్రమంగా నడుపుతున్నారు. వాళ్ళ కేదైనా సాయం చేయాలండీ,'' అన్నది నెమ్మదిగా పాలలోటా అందిస్తూ.

''నాగావళీ,'' అంటూ ఆనందాచారి ఆశ్చర్యపోయాడు.

''మనకు కావలసినంత ధనం ఉంది. ఇక కావలసింది మంచి పేరు, దయాగుణం. మీకున్నది మాయదారి జబ్బు అనుకున్నాను. కానే కాదు. ధనవ్యామోహం అనే మాయదారి జబ్బు నాది,'' అన్న భార్య మాటలు విన్న ఆనందాచారి కళ్ళు మెరిశాయి. మనసులోని దిగులు పటాపంచలైపోయింది.

''మనం బావుండాలి. మనతోపాటు మనల్ని నమ్ముకున్న వాళ్ళూ, మన చుట్టూ వున్న వాళ్ళూ సుఖంగా ఉండాలి,'' అంటూ నవ్వాడు ఆనందాచారి.

చాలా రోజులకు భర్త నవ్వు ముఖం చూసిన నాగావళి కళ్ళ నుంచి ఆనంద బాష్పాలు రాలాయి.

కానీ ఆమెలో ఈ మార్పు తీసుకురావడానికి తాను ఆకలి దహిస్తున్నా నాలుగు మెతుకులే తింటూ మనిషి సగమైపోయిన రహస్యం, బయట పొక్కనివ్వకూడదనుకున్నాడు ఆనందాచారి లేచి కూర్చుంటూ.






## లక్ష్మీదేవికి స్వర్ణదేవాలయం



శిక్కులు పరమ పవిత్రంగా భావించే అమృతసర్ స్వర్ణదేవాలయం గురించి మనకందరికీ తెలుసు. దక్షిణ భారతదేశంలో కూడా ఇటీవల ఒక స్వర్ణ దేవాలయాన్ని నిర్మించారు. తమిళనాడు వెల్లూరు సమీపంలోని శ్రీపురంలో ఈ లక్ష్మీదేవి స్వర్ణదేవాలయాన్ని నిర్మించారు. గర్భగుడికి వెళ్ళే మార్గం తప్ప తక్కిన ఆలయాన్నంతా బంగారు రేకులతో తాపడం చేశారు. ఇందుకు ఒకటిన్నర టన్నుల బంగారం ఉపయోగించారు. గత ఆగస్ట్ 24వ తేదీ నుంచి భక్తులను దర్శనానికి అనుమతించడం ప్రారంభించారు.

## చారిత్రాత్మకమైన రైలు వంతెన

రామేశ్వరం దీవినీ ప్రధాన భూమినీ కలుపుతూ పాక్ జలసంధిలో నిర్మించిన సుప్రసిద్ధ పాంబన్ రైలు వంతెన, గేజ్ మార్పిడి తరవాత ఇటీవల మళ్ళీ రైళ్ళ రాకపోకలకు తెరువబడింది. 1913వ సం.లో మీటర్‌గేజ్ రైలు మార్గంతో ఇది నిర్మించబడింది. 2,065మీ. పొడవైన ఈ ఇనుప వంతెన ప్రస్తుతం బ్రాడ్‌గేజ్ మార్గంగా మార్చబడడంతో పెద్ద రైలు పెట్టెలతో ఎక్కువ మంది ప్రయాణీకులు ప్రయాణం చేయగలుగుతారు. ఈ బ్రిడ్జిలో 146 స్పాన్స్ ఉన్నాయి. ఓడలు వెళ్ళడానికి మార్గం వదలడానికి వీలుగా కొంత భాగాన్ని పైకి ఎత్తగలగడమే ఈ వంతెన ప్రత్యేక ఆకర్షణ. ఈ భాగానికి దీనిని రూపొందించిన ఇంజినియర్ షెర్‌జెర్ పేరుపెట్టారు. ఈ వంతెనను ప్రపంచ వారసత్వ జాబితాలో చేర్చడానికి యునెస్కో వివరాలను సేకరించడం ప్రారంభించింది.



## నాకు నచ్చిన కథ-8



బాలసాహిత్యంలో రస్కిన్ బాండ్ స్థానం సమున్నతమైనది. ఆయన సాహస కృత్యాలు, ప్రకృతి, మిస్టరీ, ప్రయాణాలు, షికార్ అంటూ విభిన్న విషయాలకు సంబంధించిన కథలు రాశారు. తన పదిహేడవ యేటే తొలి నవల రచించారు. అది ప్రతిష్ఠాత్మకమైన జాన్ ల్యువలిన్ రైజ్ బహుమతిని అందుకోవడం విశేషం. ఆయన సాహిత్య అకాడెమీ అవార్డునూ; IBBY నుంచి హాన్స్ క్రిస్టియన్ యాండర్సన్ అవార్డునూ (1988) అందుకున్నారు. 1999లో పద్మశ్రీ పురస్కారంతో సత్కరించబడ్డారు. అనేక సంవత్సరాలుగా చందమామ సంపాదక సలహాదారుగా ఆయన ఉంటున్నారు.

# చందమామలో కుందేలు

చాలా కాలానికి పూర్వం ఒక అడవిలో నాలుగు తెలివైన జంతువులు-ఒక కుందేలు, ఒక నక్క, ఒక నీటికుక్క, ఒక కోతి ఉండేవి. ఆ నాలుగు జంతువులూ చాలా స్నేహంగా ఉండేవి. రోజూ సాయంకాలం ఒక చోట కూర్చుని ఆ రోజు తమకు ఎదురైన అనుభవాల గురించి ముచ్చటించుకునేవి. పరస్పరం సలహాలు ఇచ్చిపుచ్చుకునేవి. మంచి మంచి నిర్ణయాలు తీసుకునేవి.

ఆ నాలుగు జంతువులలో కుందేలు చాలా వివేకం, ఉత్తమ స్వభావం కలిగినది. అది స్త్రీపురుషుల ఔన్నత్యాన్ని గౌరవిస్తూ, మానవులలోని మంచితనం గురించీ, విద్యావివేకాల గురించీ తమ మిత్రులకు ఎల్లప్పుడూ గొప్పగా చెబుతూ ఉండేది.

ఒకనాటి సాయంకాలం చంద్రోదయం అవుతూండగా-(ఆరోజుల్లో చందమామలో ఎలాంటి గుర్తూ ఉండేది కాదు) నిండు చందమామను తదేకంగా చూస్తూ కుందేలు, ‘‘రేపు ఒక ముఖ్యమైన రోజు. సజ్జనులైన మానవులు రోజంతా ఉపవాసం ఉంటారు. సూర్యుడస్తమించేంత వరకు భోజనం చేయరు. ఇంటికి వచ్చే భిక్షువులకు, సాధువులకు దానధర్మాలు చేస్తారు. మనం కూడా రేపు ఉపవాసం చేసి మానవుల మంచితనానికీ, వివేకానికీ దగ్గరవుదాం. ఏమంటారు?'' అని అడిగింది.

అందుకు తక్కిన మూడు జంతువులూ అంగీకరించి, రోజంతా ఉపవాసం చేయాలని ప్రతినబూని తమ తమ నివాసాలకు వెళ్ళిపోయాయి.

మరునాడు తెల్లవారగానే నీటికుక్క లేచి ఒళ్ళు విరుచుకుని ఆహార సంపాదనకోసం బయలుదేరబోతూ, మిత్రులతో కలిసి తీసుకున్న నిర్ణయం జ్ఞాపకం రావడంతో ఆగిపోయింది. అయినా కొంత సేపటికల్లా, ‘‘మిత్రులతో కలిసి తీసుకున్న నిర్ణయం ప్రకారం రోజంతా ఉపవాసం చేస్తే, సాయంకాలానికి ఆకలి మరీ ఎక్కువైపోతుంది. ఉపవాసదీక్ష ముగియగానే తినడానికి ఏదైనా సంపాదించి ఉంచడం మంచిది,''

అనుకుంటూ వెళ్లగా నదీ తీరం కేసి బయలు దేరింది.

అప్పుడనగా రాత్రంతా పెద్దపెద్ద చేపలు పట్టిన బెస్తవాడొకడు, వాటిని ఇసుకలో పూడ్చి తరవాత వచ్చి తీసుకువెళదామని మరేదో పని మీద వెళ్ళాడు. నీటికుక్క అటుకేసి వెళుతూ ఇసుకలో నుంచి చేపలవాసన రావడం పసిగట్టి పట్టరాని సంతోషంతో, ''ఆహా! రాత్రి భోజనం సిద్ధంగా ఉంది!'' అనుకున్నది. మరు క్షణమే, ''ఈరోజు పుణ్యదినం గనక నేను దొంగతనం చేయకూడదు,'' అనుకుని, ''ఈ చేపలు ఎవరివి? వీటి సొంతదారు ఎవరైనా ఉన్నారా?'' అని గట్టిగా అడిగింది.

సమాధానం రాకపోయేసరికి, సంతోషంగా చేపను తీసుకెళ్ళి తన నివాసంలో రాత్రి ఆహారం కోసం భద్రపరిచింది. తలుపుమూసుకుని భిక్ష కోసం వచ్చే బిచ్చగాళ్ళ, సాధువుల బెడద లేకుండా రోజంతా నిద్రపోయింది.

కోతి, నక్క కూడా పొద్దున లేవగానే అదే ధోరణిలో ఆలోచించాయి. మిత్రులతో కలిసి చేసిన ప్రతిజ్ఞను గుర్తు చేసుకున్నాయి. రోజంతా ఉపవాసం చేయాలి. అయితే, ఉపవాసం ముగిశాక రాత్రికి ఏదైనా తినాలి. అందుకు దాన్ని ఇప్పుడే సంపాదించి పెట్టుకోవాలి అనుకున్నాయి.

నక్క ఎవరి పెరట్లోనో ఉన్న ఎండు మాంసాన్ని తెచ్చి రాత్రికి తిందామని తన బొరియలో భద్రపరచుకున్నది. కోతి ఒక మామిడి చెట్టెక్కి, ఒక మామిడిగెలను కోసి తెచ్చి తను ఉన్న చోట భద్రపరచింది. ఆ తరవాత ఆ రెండూ కూడా నీటికుక్కలాగే నిశ్చింతగా నిద్రకు ఉపక్రమించాయి.



కుందేలు తెల్లవారక ముందే నిద్రలేచింది. పొడవాటి చెవులను విదిలించుకుంటూ బొరియ నుంచి వెలుపలికి వచ్చి, మంచు తడిసిన పచ్చికను వాసన చూసింది. ''సాయంకాలానికి ఈ పచ్చగడ్డిని తినవచ్చు. అయితే, ఏ భిక్షువో సాధువో వస్తే ఇవ్వడానికి నాదగ్గర ఈ పచ్చగడ్డి తప్ప మరేదీ లేదే. ఈ గడ్డిని ఎలా ఇవ్వగలను? నన్ను నేనే సమర్పించుకోవడం ఒక్కటే మార్గంగా కనిపిస్తున్నది. చాలా మంది మనుషులు కుందేలు మాంసం ఇష్టంగా తింటారనుకుంటాను. కుందేలు మాంసం చాలా రుచిగా ఉంటుందని వాళ్ళు చెప్పుకోవడం కూడా లోగడ చాలా సార్లు విన్నాను,'' అంటూ తన సమస్యకు పరిష్కారం లభించినందుకు సంతోషంతో అటూ ఇటూ గెంతసాగింది.

కుందేలు మాటలను మేఘాలలో విశ్రాంతి తీసుకుంటూన్న సక్కాదేవుడు విన్నాడు. ''ఇది నిజంగానే అంత నిస్వార్థమైన త్యాగబుద్ధిగల కుందేలేనా అని పరీక్షించాలి,'' అనుకున్నాడు.

సాయంకాలమవుతూండగా సక్కా దేవుడు ఒక వృద్ధపూజారి రూపంలో మేఘం నుంచి దిగి వచ్చి కుందేలు బొరియ ముందు కూర్చున్నాడు. కుందేలు తిరిగి రాగానే, ''నమస్కారం కుందేలు మిత్రమా! ఏదైనా తినడానికి ఇవ్వగలవా? రోజంతా ఉపవాసం చేయడంవల్ల ప్రార్థించడానికి కూడా శక్తిలేకుండా నీరసంగా ఉన్నాను,'' అన్నాడు.

''మనుషులు కుందేలు మాంసం ఇష్ట పడి తింటారు కదా?'' అని అడిగింది కుందేలు.

''అవును, తింటారు,'' అన్నాడు పూజారి.

''అలా అయితే చాలా మంచిది. నా దగ్గర మరే ఆహారమూ లేదు. నువ్వు నన్నే హాయిగా తినవచ్చు,'' అన్నది కుందేలు.

''బాగానే వుంది. అయినా, నేను పూజారిని. పైగా, ఈ రోజు పుణ్యదినం. నా చేతులతో ఏ ప్రాణినీ చంపజాలను,'' అన్నాడు వృద్ధుడు విచారంగా.

''అలా అయితే కొన్ని ఎండు పుల్లలను ఏరి మంట ఏర్పాటు చెయ్. నేను మంటల్లోకి

చందమామ ఇండియా క్విజ్-11 (డిసెంబర్ 2007) సమాధానాలు

1. భీమాబాయి సక్పాల్; 2. కస్తూరిబాయి-మోహన్ దాస్ కరంచంద్ గాంధీ - 1869; 3. రవీంద్రనాథ టాగూర్; 4. కమలాదేవి చటోపాధ్యాయ; 5. వినోబా భావే.

చందమామ ఇండియా క్విజ్ - 11 (డిసెంబర్ '07)

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఎంట్రీలు పాఠకుల నుంచి ఒక్కటీ రాలేదు. అందువల్ల బహుమతి ఇవ్వలేక పోతున్నాం.

దూకేస్తాను. కాలాక నన్ను వెలుపలికి తీసి నా మాంసం తినవచ్చు,'' అన్నది కుందేలు.

ఆ మాటలకు ముగ్ధుడైన సక్కాదేవుడు దానిని ఇంకా పరీక్షించడానికి, అది చెప్పినట్టే చితుకులను ఏరి మంట రాజిల చేశాడు. కుందేలు ఏమాత్రం వెనుకాడకుండా మంటల మధ్యకు ఉరికేసింది. కొంతసేపటికి, ''ఇక్కడ ఏం జరుగుతున్నది? నా చుట్టూ అగ్ని జ్వాలలు ఉన్నాయి. అయినా, ఒంటి మీది ఒక్క రోమం కూడా కాలిపోలేదేమిటి? చాలా చల్లగా ఉందే!'' అన్నది కుందేలు.

అంతలోనే మంటలు చల్లారిపోయాయి. కుందేలు మెత్తటి పచ్చికమైదానం మధ్య కూర్చుని ఉన్నది. పూజారి స్థానంలో సక్కాదేవుడు దివ్య తేజస్సుతో వెలిగిపోతూ కనిపించాడు.

''కుందేలు మిత్రమా! నేను సక్కాదేవుణ్ణి. నీ ప్రతిజ్ఞ విని, నీ చిత్తశుద్ధిని పరీక్షించడానికి వచ్చాను. నీలాంటి నిస్వార్థ త్యాగజీవికి అమరత్వం ప్రసాదించాలి. నీ నిస్వార్థ త్యాగగుణం యావత్ ప్రపంచానికి తెలియాలి,'' అంటూ సక్కాదేవుడు కుందేలును ఆశీర్వదించి, తన చేతులను పర్వతాలకేసి సాచాడు. అందులో నుంచి ఒక మంత్రదండాన్ని స్వీకరించాడు. దానిని ఉదయిస్తున్న నిండు చందమామ కేసి విసిరాడు. చందమామలో కుందేలు బొమ్మ ఏర్పడింది.

ఆ తరవాత కుందేలుతో, ''బుల్లి కుందేలు పిల్లా! నువ్వు చందమామ నుంచి ఎల్లప్పుడూ భూమిని చూస్తూ, 'మీరు ఇతరులకు ఇవ్వండి. దేవతలు మీకు ఇస్తారు,' అన్న సనాతన సత్యాన్ని మానవులకు గుర్తు చేస్తూ ఉంటావు!'' అని చెప్పి అదృశ్యమయ్యాడు.

-(బౌద్ధపూర్వగాథ ఆధారంగా)



# చందమామ కబుర్లు

## ఎత్తయిన బుద్ధవిగ్రహం



**2008** ఒలింపిక్ క్రీడలు నిర్వహించడానికి చైనా సర్వ సన్నాహాలతో ఆయత్తమవుతోంది. అదే సమయంలో ఒలింపిక్ పర్యాటకులను ఆకర్షించడానికి అక్కడి సిచువాన్ ప్రాంతంలో వున్న ప్రపంచంలోకెల్లా ఎత్తయిన బుద్ధ విగ్రహాన్ని మెరుగు పరచే పనులు కూడా ముమ్మరంగా జరుగుతున్నాయి. వాతావరణం, ఆమ్ల వర్షం కారణంగా విగ్రహం బాగా దెబ్బతిని పోయింది. లెషాన్ పర్వత శిఖరం మీది 71 మీటర్ల ఎత్తయిన ఈ బుద్ధ విగ్రహాన్ని మలచడం క్రీ.శ. 713లో ప్రారంభించబడి దాదాపు 90 సంవత్సరాలు కొనసాగింది. టాంగ్ వంశస్థులు ఈ విగ్రహాన్ని మలిచారు. 2001వ సం.లో దీన్ని శుభ్రపరచడం, బాగు చేయడం లాంటి పనులు చేపట్టారు. యునెస్కో ప్రపంచ వారసత్వ సంపద జాబితాలో చోటు చేసుకున్న ఈ విగ్రహం చుట్టూవున్న 17 చ.కి.మీ. ప్రాంతాన్ని అందంగా తీర్చి దిద్దడానికి గత పదేళ్ళుగా లెషాన్ అధికారులు కృషి చేస్తున్నారు.

## వందసంవత్సరాల తరవాత త్రివర్ణ పతాకావిష్కరణ!

**1907** ఆగస్ట్ 22వ తేదీ జర్మనీ స్టట్‌గార్ట్‌లో జరిగిన ఇంటర్నేషనల్ సోషలిస్ట్ కాంగ్రెస్‌లో భారతదేశానికి చెందిన మేడమ్ భికైజీ కామా కలుసుకున్నారు. అప్పుడామె త్రివర్ణ పతాకాన్ని ఆవిష్కరించి-స్వతంత్ర భారత పతాక వందనం చేయమని అక్కడి వారిని ఉద్వేగంతో కోరారు. 1936లో ఆమె కాలధర్మం చెందాక పుణేలోని లోకమాన్యతిలక్ మ్యూజియంలో ఆ జెండాను భద్రపరిచారు. వంద సంవత్సరాల తరవాత అదే 2007 ఆగస్ట్ 22వ తేదీ ఆ జెండాను వెలుపలికి తీసి పుణేలోని బాలగంధర్వ ఆడిటోరియంలో ఆవిష్కరించారు. ఈ త్రివర్ణపతాకంలో ఎనిమిది ప్రాంతాలకు గుర్తుగా ఎనిమిది తామర పువ్వులూ, హిందూ-ముస్లిం సౌభ్రాతృత్వానికి ప్రతీకగా సూర్య చంద్రుల బొమ్మలూ చిత్రించబడ్డాయి. మధ్యలో దేవనాగరి లిపిలో 'వందే మాతరం' అని లిఖించబడి ఉన్నది.






# నా బెలూరే... కొకారే బెలూరే...

చెట్టు కింద చెవులు దిమ్మిరెత్తేలా శబ్దం. రోజూ సాయంకాలం తిరిగివచ్చాక, మేమందరం ఒక్క సారిగా మాట్లాడ్డానికి ప్రయత్నించడం వల్ల చెల రేగే శబ్దం కన్నా ఇది దారుణంగా ఉంటోంది!

ఈ రుతువులో ఇది మామూలే గనక, ఇలాంటి శబ్దాలకు నేను ఇప్పుడు అలవాటు పడిపోయాను. పైన చెట్ల మీద ఒకరిని ఒకరు ఆకర్షించడానికి అరుపులు. కింద గ్రామంలో పెళ్ళి బాజాభజంత్రీలు. ఈ రోజు శబ్దం మరీ భయంకరంగా ఉంది. ఎందుకో తెలుసా? మా చెట్టుకిందే పెళ్ళి జరుగుతోంది! మా పిల్లలు ఆ శబ్దాలను తట్టుకోలేకపోతున్నాయి. అవి ఈ ప్రపంచంలోకి వచ్చిన తొలిరోజున ఎలాంటి స్వాగతమో చూడండి మరి!

నా మాటలను బట్టి నేనొక పక్షినని మీరిది వరకే గ్రహించి ఉంటారు. మీరు మమ్మల్ని మచ్చల ముక్కు గూడకొంగలని పిలుస్తారని నా స్నేహితురాలూ, చాలా మంచి అమ్మాయీ అయిన మాలూ చెప్పగా విన్నాను. వందలాది గూడకొంగలూ, రంగుల కొంగలూ కలిసి ఒకే చోట ఉంటున్నాం. ఈ అద్భుతమైన గ్రామం అంటే మాకు ఎంతో ఇష్టం. దీనిని మేము మా గ్రామం కొకారే బెలూరేగానే పిలుస్తాం. ఇది మైసూరుకు సమీపంలో ఉంది.

ఒక సంవత్సరంలో ఆరు నెలలు మేము ఇక్కడే గడుపుతాం. పిల్లల్ని పొదుగుతాం. కొంత కాలం వాటిని పెంచుతాం. ఆ తరవాత మిగిలిన ఆరు నెలలు మా వేసవి నివాసాలకు ఎగిరి వెళ్ళిపోతాం. మా వేసవి నివాసాల నుంచి ఇక్క డికి ఎగిరి వచ్చే మార్గం ప్రమాదాలునిండినది. అయితే, ఇక్కడికి చేరుకుంటే చాలు. మాకు ఎలాంటి విచారమూ ఉండదు. ఎందుకంటే కొకారే బెలూరే చాలా సురక్షిత ప్రాంతం. పక్షుల శరణాలయంలో ఉన్నంత క్షేమంగా ఇక్కడ ఉండగలుగుతున్నాం.

ఇక్కడ పెద్దపెద్ద చింత చెట్లూ, వేప చెట్లూ చాలా ఉన్నాయి. వాటి మీద గూళ్ళు నిర్మించుకో వడం అంటే మాకెంతో ఇష్టం. మేము వందలాది మంది ఈ చెట్ల కొమ్మల మీద ఉంటున్నాం. మేము రాగానే ఈ గ్రామస్థులు చాలా సంబర పడుతూ ఉంటారు. మేము రావడం అదృ ష్టంగా భావిస్తారు. వాళ్ళు మాకెలాంటి హానీ చేయరు. మేము నివాసముండే చెట్లను నర కరు. ఒక్కొక్కసారి చింత చెట్ల నుంచి చింత



పక్షులకు నిన్న ఏం జరిగిందో తెలుసా? వాటి పిల్లలు మా పిల్లల కన్నా పెద్దవి. అన్ని పెరిగే పిల్లలకులాగే వాటికీ ఆకలి ఎక్కువ. ఆకలిగా ఉన్న కుటుంబానికంతటికీ ఒక్క పక్షి ఎలా ఆహారం సంపాదించుకు రాగలదు?

నిన్న పిల్లల్ని వదిలి రెండు పెద్దపక్షులూ చేపల వేటకు వెళ్ళాయి. ఒక్క క్షణంలో ఒక కాకి కిందికి ఉరికి ఒకపిల్లను తన్నుకు పోయింది. అది అలా తన్నుకు పోయినప్పుడు గూడు బాగా కదిలి పోవడంతో మిగిలిన పిల్లలు కూడా కిందపడిపోయాయి. కింద తిరుగుతూన్న కుక్కలు వాటిని తినేశాయి. కొన్ని నిమిషాల్లో నా పొరుగు కుటుంబం సర్వనాశనమై పోయింది!

కొన్ని సంవత్సరాల క్రితం జరిగిన ఇలాంటి దుర్ఘటనే, మాలూ అనే మంచి స్నేహితురాలిని నా చెంతకు చేర్చింది. ఆ అమ్మాయి ఈ రోజు పెళ్ళికూతురయిందని మీకు చెప్పానా? ఆమెకే చెట్టుకింద పెళ్ళి జరుగుతోంది!

నాకు చాలా సంతోషంగా ఉంది.అది సరే, మొదట కొన్నేళ్ళ క్రితం కాకి నా మీద దాడి చేసినప్పుడు ఏం జరిగిందో చెప్పి పూర్తి చేస్తాను. నేనప్పుడు చాలా చిన్న పిల్లను. ఎగరడం కూడా చేతకాదు. నేల మీద పడిపోయాను. పెద్దపెద్ద కుక్కలు నోళ్ళు తెరుచుకుని ఆత్రంగా నాకేసి పరిగెత్తుకు రావడం చూసి హడలిపోయాను. నాగుండె కొట్టుకోవడం ఆగినంత పనయింది. అంతలో ఎవరో వచ్చి నన్ను పైకి ఎత్తుకున్నారు.

ఆహా! చుక్కల ముక్కు గూడకొంగపిల్ల అన్న మాటలు విని నీళ్ళునిండిన కళ్ళతో ఆ అమ్మా యిని చూశాను. ఆ అమ్మాయే మాలూ. కుక్కల

పళ్ళను రాల్చుకోవడానికి కూడా వెనకాడుతారు. పాపం పేదవాళ్ళయిన ఆ గ్రామస్థులకు ఇది చాలా నష్టమే. అయినా మా పిల్లలకు హాని చేయకూడదన్న గొప్ప మనసుతో అలా చేస్తారు. వాళ్ళు మా మంచి స్నేహితులు.

మేముండే చెట్ల కింద పడే మా పెంటను పోగుచేసి వాళ్ళు పొలాలకు గువానో (ఎరువు)గా ఉపయోగిస్తారు.

నేనిక్కడ సురక్షితంగా ఉన్నట్టు చెప్పాను కదూ. అవును చాలావరకు సురక్షితంగానే ఉన్నాను. అదిగో నా ఎదురుగా కొమ్మ మీద బైఠాయించిన కాకిని చూశారూ! అది నా పిల్ల లను తన్నుకుపోవడానికి పొద్దుట్నించి అవ కాశం కోసం ఎదురు చూస్తోంది. నేను ఒక క్షణం అటువెళితే చాలు. అది హాయిగా నా పిల్లల్ని భోంచేస్తుంది. మా పొరుగుగూట్లో ఉన్న

నుంచి నన్ను కాపాడింది. నా తల్లిదండ్రులు చేపలవేటకు వెళ్ళడంవల్ల నేను మాత్రమే మిగిలాను.

మాలూ నన్ను మానూ అనే ఒక అందమైన యువకుడి వద్దకు తీసుకువెళ్ళింది. మనుషులకు, పక్షులకు మధ్య వున్న విలక్షణమైన సంబంధం గురించి అధ్యయనం చేయడానికి కొన్నాళ్ళ క్రితం ఆ యువకుడు అక్కడికి వచ్చాడట. నా గాయాలకు కట్లు కట్టి ఆహారం తినిపించడానికి అతడు మాలూకు సాయపడ్డాడు. కళ్ళు తెరవడానికి కూడా నాలో శక్తిలేదు.

ఆ యువకుడే కొకారే బెలూరే చాలా ప్రత్యేకమైన గ్రామమని చెప్పాడు. అయితే ఇలాంటి గ్రామం మన దేశంలో ఇదొక్కటే కాదనీ; పక్షులకు ఆదరంతో ఆశ్రయమిచ్చే గ్రామాలు అక్కడక్కడ చాలా ఉన్నాయని కూడా చెప్పాడు.

మాలూ నాకేసి ఒకసారి పరిశీలనగా చూసి, ''ఇలాంటి పక్షిపిల్లలకు నేనేం సాయం చేయగలను?'' అని అడిగింది. కొంతసేపు మౌనం వహించిన మానూ, ''వీటికో అనాధశరణాలయమూ, వైద్యనిలయమూ ప్రారంభించవచ్చు,'' అన్నాడు.

ఆ మాట అందరికీ నచ్చడంతో వాటిని నెలకొల్పడానికి ఆసక్తితో ప్రయత్నించసాగారు. దాని ఫలితంగా గ్రామంలో ఒక అనాధ శరణాలయం, ఆస్పత్రి ఏర్పడ్డాయి. వాటిని యువకులే నిర్వహించడం మరో విశేషం. ఇవాళ మాలూ పెళ్ళి చేసుకుని మరో ఊరికి వెళ్ళిపోతున్నది. అయితే... అనాధశరణాలయం ఇలాగే కొనసాగగలదని అనుకుంటాను. ఆమె స్నేహితులూ, మానూ దానిని నిర్వహించడానికి పూనుకోగలరు!

పెళ్ళికూతురుగా మాలూ ఎలా ఉన్నదో వెళ్ళి చూడాలి. నిన్న ఆమె నన్ను చూడడానికి వచ్చింది. ఆమె కళ్ళనిండా నీళ్ళు. ఆమె చాలా దూరంలో ఉన్న... ఆగ్రాకు వెళుతున్నదట. ఎప్పుడు మళ్ళీ వస్తుందో తెలియదని చెప్పింది. నేనూ ఆమెకు ఎన్నో విషయాలు చెప్పాలనుకున్నాను. అయినా నా మాటలు ఆమెకు అర్థం కావు కదా! నేను ఆకాశంలో ఎగిరి వెళుతూంటే నేల మీది నుంచి ఆమె నన్ను చూడవచ్చని చెబుతామనుకున్నాను.

ఆహా! ఆగండి ఒక్క నిమిషం... ఆమె ఆగ్రా అనే కదా అన్నది? మేము ఇక్కడి నుంచి వెళ్ళేది కూడా అక్కడికే కదా?... అక్కడికి సమీపంలోనే కదా అందమైన చిత్తడి నేల గల భరత్‌పూర్ ఉంటోంది! మా పిల్లలు పెరిగాక మేము ఇక్కడి నుంచి భరత్‌పూర్‌కు వెళతాం.

నేను మాలూను మళ్ళీ త్వరలో అతి త్వరలో చూడగలనని ఆమెకు చెప్పాలి... తప్పక చెప్పాలి... ఇప్పుడే చెప్పాలి!



## చిరస్మరణీయ చారిత్రక ఘట్టాలు-5

# మృత్యువు కోరలమధ్య నుంచి...

ఒకనాడు ఔరంగజేబు, మహారాజా జస్వంత్ సింగ్‌తో కలిసి విశాలమైన రాజోద్యానంలో పచార్లు చేస్తూ, ''ఇంత పెద్ద భయంకరమైన పులిని తమరెప్పుడైనా చూశారా?'' అంటూ ఒకవైపు బోనులో అసహనంగా తిరుగుతున్న పెద్దపులిని చూపాడు.

''మా వీరభూమిలో పసిపిల్లలు సైతం ఇలాంటి పులులతో ఆటలాడుకుంటారు, ప్రభూ!'' అంటూ రాజాజస్వంత్‌సింగ్, దూరంగా నిలబడ్డ తన కుమారుడు పృథ్వీసింగ్‌ను చేయి ఊపి దగ్గరికి పిలిచి, పులితో పోరాడమని పురమాయించాడు.

పదహారేళ్ళ యువప్రాయంలో ఉన్న పృథ్వీ సింగ్ అమితోత్సాహంతో పులి బోనులోకి వెళ్ళి పులితో కలియబడ్డాడు. కొంతసేపు దానితో పెనుగులాడి భీకరంగా పోరాడి మొలలోని బాకు తీసి దానిగుండెల్లోకి పొడిచాడు. పులి చివరి సారిగా గాండ్రించి ప్రాణాలు విడిచింది.




తన కళ్ళను తనే నమ్మలేక గుడ్లప్పగించి చూసిన ఔరంగజేబు లోలోపల భయభ్రాంతు డయ్యాడు. కొడుకే ఇంతటి సాహసవీరుడైతే, తండ్రి ఎలాంటివాడై ఉంటాడు? అన్న ఆలోచన అతడి మనసును కలచివేసింది.

జస్వంత్ సింగ్, మార్వార్ (ప్రస్తుత జోధ్‌పూర్) రాజు. రాజస్థాన్‌లోని థార్ ఎడారిని ఆనుకుని వున్న 'మార్వార్' అంటే 'మరణ భూమి' అని అర్థం. మానవ నివాసానికి అనువుగాని వాతావరణం. విపరీతమైన నీటి ఎద్దడి. ఇసుక నేల స్వరూపాన్నే మార్చివేసే ఇసుక తుపానులు. కరువు కాటకాలు. అయినప్పటికీ మాతృభూమి మీది మమకారం కొద్దీ, భూమి మీద అధికారం కోసం ఎన్నో యుద్ధాలు చేశారు అక్కడి వీరపాలకులు.

మార్వార్ పాలకుడు జస్వంత్‌సింగ్ అసమాన పరాక్రమశాలి అయినప్పటికీ, స్వార్థ ప్రయోజనాల కోసం ఎలాంటి నియమాలు పాటించకుండా మిత్రులను సైతం హతమార్చగలడన్న పేరు తెచ్చుకున్నాడు. అది ఔరంగజేబుకు మరింత కంటక ప్రాయంగా తయారయింది. ఆ రాజపుత్ర రాజు అంతం చూడడానికి మొగలు చక్రవర్తి ఎన్నో విధాలుగా ప్రయత్నించాడు. అయినా, జస్వంత్ సింగ్ ఆఖరి క్షణంలో అద్భుతమైన ఎత్తుగడలతో శత్రువుల కళ్ళల్లో కారంచల్లి సురక్షిత ప్రాంతానికి

ప్రాణాలతో తప్పించుకుని పారిపోయేవాడు. మార్వార్ రాజును హతమార్చాలన్న మొగల్ చక్రవర్తి పథకాలను, కుతంత్రాలను భగ్న పరచినవారిలో రాజుకు విశ్వాసపాత్రుడైన ముకుంద్ దాస్ మున్నెన్న తగినవాడు. అతడు కుంపావత్ వంశానికి చెందిన నాయకుడు. అతడు ఒకసారి ఔరంగజేబు పంపిన సందేశానికి దురుసుగా సమాధానం ఇచ్చి అతడి ఆగ్రహానికి గురయ్యాడు. అతడిపై పగసాధించడానికి చక్రవర్తికి మంచి అవకాశం లభించింది. అతన్ని శిక్షించే నెపంతో ఆకలిగొన్న పులి నివాసంలోకి నిరాయుధపాణిగా ప్రవేశించి పోట్లాడమని ఆజ్ఞాపించాడు.

ముకుంద్ దాస్ నిర్భయంగా అందులోకి ప్రవేశించాడు. పులి అతణ్ణి చూస్తుండగా, ''ఓ మియాన్ పులీ! ఈ జస్వంత్ పులిని ఎదుర్కో!'' అంటూ ఆగ్రహంతో దాని కళ్ళల్లోకి తీక్షణంగా చూశాడు. ఆ వింత ఆగంతకుడి విచిత్ర ప్రవర్తనకు విస్తుపోయిన పులి తలవంచుకుని వెనుదిరిగి వెళ్ళిపోయింది.

''దానికి నన్ను ఎదుర్కొనే ధైర్యం లేదు. ఎదిరించని శత్రువు మీదికి కాలుదువ్వడం రాజపుత్ర వీరుల లక్షణం కాదు,'' అంటూ వెలుపలికి వచ్చాడు ముకుంద్‌దాస్.

అతడి సాహసకృత్యానికి ఆశ్చర్యపోయిన ఔరంగజేబు విలువైన కానుకలతో అతణ్ణి సత్కరించి పంపాడని చెబుతారు. అప్పటి నుంచి ముకుంద్‌దాస్‌కు నహర్‌ఖాన్ (పులి రాజు) అనే పేరు వచ్చింది. అలాంటి అసమాన వీరుల రక్షణ, కవచంగా ఉండడం వల్లే ఔరంగజేబు ఎంత ప్రయత్నించినా జస్వంత్‌సింగ్‌ను హతమార్చలేక పోయాడు. అతడి దుష్ట పథకాలన్నీ నిష్ప్రయోజనమై పోయాయి. అందువల్ల స్నేహ హస్తం సాచక తప్పలేదు. జస్వంత్‌సింగ్‌కు కొన్ని ఆశలు చూపి తన సేనకు అధిపతిగా చేసి, తిరుగుబాటుదారుల నణచడానికి కాబూలుకు పంపాడు.

అది చక్రవర్తి ఆజ్ఞకావడంతో జస్వంత్‌సింగ్ కాదనలేక పోయాడు. తన రాజ్య పాలనాబాధ్యతలు పెద్ద కుమారుడైన పృథ్వీసింగ్‌కు అప్పగించి, కొందరు కుటుంబ సభ్యులతో, విశ్వాసపాత్రులైన మిత్రులతో కాబూల్‌కు బయలుదేరాడు. త్వరలోనే అతడు ఆ ప్రాంతానికి గవర్నర్‌గా నియమించబడ్డాడు.

ఔరంగజేబు ఒకనాడు మార్వార్ యువవారసుడు పృథ్వీసింగ్‌ను సభకు పిలిపించాడు. కొన్ని సంవత్సరాల క్రితం ఆ యువకుడు భీకరమైన పులితో ఒంటరిగా పోరాడి చంపిన విషయం అతడు మరిచిపోలేదు. అందుకు ఇప్పుడతణ్ణి గొప్పగా మెచ్చుకున్నాడు. అతడు



ఆజ్ఞాపించగానే గౌరవసూచకంగా ఆకర్షణీయమైన దుశ్శాలువను ఇద్దరు భటులు తీసుకువచ్చి పృథ్వీసింగ్‌కు కప్పారు. యువరాజు పృథ్వీసింగ్ పరమానందంతో అక్కడినుంచి బయలుదేరాడు. అయితే, అతని ఆనందం ఎంతో సేపు నిలువలేదు. కొంతసేపటికే ఒళ్ళంతా బొబ్బలతో మంటలు పుట్టి గంటల వ్యవధిలోనే ప్రాణాలు కోల్పోయాడు!

ప్రత్యక్షంగా ఎదుర్కొనే చేవలేక, దుర్మార్గుడైన చక్రవర్తి కానుకగా ఇచ్చిన బట్టలకు ప్రాణాంతకమైన విషం రాసి యువరాజు ప్రాణాలు అపహరించాడు!

కుమారుడు హతుడయ్యాడన్న దుర్వార్త విని జస్వంత్‌సింగ్ దిగ్భ్రాంతికి లోనయ్యాడు. అప్పటికే ఆయన చిన్న కుమారులిద్దరూ అనారోగ్యంపాలై కాబూల్లోనే చనిపోయారు. వారసులు లేని మార్వార్‌రాజు జస్వంత్ సింగ్ స్వస్థలానికి దూరంగా 1678లో మరణించాడు. శత్రువును దుంపనాశం చేసినందుకు ఔరంగజేబు పొంగిపోయి, మార్వార్‌ను వశపరచుకున్నాడు. అక్కడి ఆలయాలను ధ్వసం చేశాడు. రాజభవనంలోని నిధులను దోచుకున్నాడు.

అయితే, అచిరకాలంలోనే మరో ఆశ్చర్యకరమైన వార్త చక్రవర్తిని కలవరపెట్టింది. జస్వంత్ సింగ్‌తో పాటు కాబూల్ వెళ్ళిన రాజపుత్రయోధులు తిరిగివస్తున్నారన్నదే అది. వారితో పాటు గర్భిణిగా వున్న కారణంచేత సహగమనం చేయలేక, ఆ తరవాత మగశిశువును ప్రసవించిన జస్వంత్‌సింగ్ రాణి కూడా ఉన్నది. చంటి బిడ్డ అజిత్‌సింగ్‌ను రాజపుత్రులు తమ రాజుగా భావించి తల్లితోపాటు తీసుకువస్తున్నారు. ఔరంగజేబు దానిని గురించి తీవ్రంగా ఆలోచించి ఒక పథకం రూపొందించాడు. శిశువుగా ఉన్న అజిత్ సింగ్‌తో పాటు రాజపుత్రులకు ఘనంగా స్వాగతం పలికి ఢిల్లీ దర్బారుకు ఆహ్వానించాడు. యువరాజు అజిత్‌సింగ్‌ను తన రక్షణలో వదిలే పక్షంలో వారికి మార్వార్ రాజ్యాన్ని అప్పగించడంలో తనకెలాంటి ఆక్షేపణా లేదని తెలియజేశాడు. రాజపుత్రులు అతడి నిబంధనను తిరస్కరించడంతో అందరినీ ఖైదుచేసి మొగల్ సేనలను కాపలా ఉంచాడు.

చిక్కులో పడ్డ రాజపుత్ర సైనికులు, తమ రాజ్యానికి మిగిలిన ఏకైక వారసుడైన యువరాజు అజిత్‌సింగ్‌ను కాపాడడమే ధ్యేయంగా భావించారు. గోరాదాయ్ అనే దాది, పాములాడించేవాడి వేషంలో బయలుదేరిన ముకుంద్‌దాస్ సాయంతో శిశువుగా వున్న యువరాజును చీకటి



తెరమాటున రహస్యంగా తీసుకువెళ్ళింది. అలా వెళ్ళేప్పుడు మొగల్ సైనికులకు అనుమానం రాకుండా, ఆమె తన కన్నబిడ్డను అక్కడవదిలి వెళ్ళింది.

రాజపుత్రయోధుడు దుర్గాదాస్ రాథోడ్ తక్షణ యుద్ధానికి సన్నద్ధుడయ్యాడు. వెనకటి రాజపరివారంలోని స్త్రీలందరూ భారీగా తుపాకీ మందు నిలువచేసిన గదిలోకి చేరారు. దానికి నిప్పంటించడంతో భయంకరమైన శబ్దంతో అది పేలిపోయింది. ఒక్క రాజమాత తప్ప తక్కిన వారందరూ మానసంరక్షణకోసం ప్రాణాలను అగ్నికి ఆహుతి చేశారు.

మండుతూన్న భవనం నుంచి వెలుపలికి వచ్చిన దుర్గాదాస్ రాథోడ్ తమ అనుచరులతో కలిసి మొగలు సేనలను ఎదుర్కొన్నాడు. అంతలో శిశువుయువరాజును కొందరు తీసుకు వెళుతూన్న విషయం శత్రువులు పసిగట్టి వారి వెంట బడ్డారు. అయితే, వారిని రాజపుత్ర వీరుల ఖడ్గాలు అడ్డుకోవడంతో గోరాదాయ్ శత్రువుల చేజిక్కకుండా పారిపోగలిగింది. ఆఖరికి మొగలుసేనల నెదుర్కొన్న మూడు వందల రాజపుత్ర సైనికులలో ఏడుగురు మాత్రమే మిగిలారు. శత్రుసేనలు వేగంగా చొచ్చుకురాసాగాయి. యువరాజు అజిత్‌సింగ్ మాతను రక్షించడం ఎలాగో తెలియలేదు. దుర్గాదాస్ తన చేతి లోని ఖడ్గాన్ని రాజమాతకు అందించాడు. శత్రువుల చేజిక్కకూడదన్న ఏకైక లక్ష్యంతో ఏమాత్రం వెనుకాడకుండా ఖడ్గంతో పొడుచుకుని ప్రాణత్యాగం చేసింది మార్వార్ రాణి. తీవ్రంగా గాయపడ్డ దుర్గాదాస్, మిగిలిన తన అనుచరులతో అక్కడి నుంచి తప్పించుకున్నాడు.

అదే సమయంలో మారుమూల కొండలలో సురక్షిత ప్రాంతాన్ని చేరిన యువరాజు అజిత్ విశ్వాసపాత్రుల మధ్య 'కుండలోని దీపం'లా పెరగసాగాడు. అతడెక్కడో పెరుగుతున్నాడన్న వార్త రాజపుత్రుల మధ్య వ్యాపించింది. ఎనిమిదేళ్ళ ప్రాయంలో ఉన్నప్పుడు పలువురు ప్రముఖులు వెళ్ళి అజిత్ సింగ్‌ను కలుసుకున్నారు. మొగలుల అధికార బంధనం నుంచి బయట పడే పోరాటాన్ని ఉధృత పరచాలని నిర్ణయించారు. అచిరకాలంలోనే అనేక ప్రాంతాలను వశపరచుకున్నారు.

ఔరంగజేబు వృద్ధుడయ్యేసరికి రాజపుత్ర వీరులు బలపడడం చూశాడు. శక్తివంతుడైన ఆఖరి మొగలు పాలకుడుగా పేరుగాంచిన అతడు 1707 మార్చ్‌లో మరణించాడు. అజిత్ సింగ్, దుర్గాదాస్ రాథోడ్ ఆక్రమణదారులను మాతృభూమినుంచి తరుమగొట్టారు. యువరాజు అజిత్ సింగ్ మార్వార్ మహారాజాగా కొలువుదీరాడు.

(ఎకెడి)



## మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (26)

# ఉరిమే మేఘమూ వర్షిస్తుంది!

క్రీ.పూ. 5వ శతాబ్దంలో ఏథెన్స్ నగరంలో జీవించిన సుప్రసిద్ధ గ్రీకు తత్వవేత్త సోక్రటీసు, నాటి యువకులలో తార్కికబుద్ధినీ, వివేకాన్నీ పెంపొందించడానికి కృషి చేశాడు. ఆయన మాటలు విని శ్రోతలు పరవశం చెందేవారు. ఆయన యువకులను కొన్ని ప్రశ్నలడిగి వాటికి సమాధానాలు కనుగొనడానికి దారి చూపేవాడు. గొప్ప సత్యాలను, క్లిష్టమైన విషయాలను సైతం సరళ శైలిలో విపులీకరించేవాడు.

మరో సుప్రసిద్ధ వక్త, తత్వవేత్త అయిన సిసిరో, ''తత్వ శాస్త్రాన్ని దివి నుంచి భువికి దించిన మహానుభావుడు,'' అని సోక్రటీసును కీర్తించాడు. ఆయన బోధించే తాత్విక విషయాలను శ్రోతలు నిత్య జీవితంలో ఎదురయ్యే సమస్యలకు అన్వయించుకుని పరిష్కారాలు కనుగొనగలిగే వారన్న మాట. తాత్విక విషయాలంటే కేవలం ఏవో ఆలోచనలకు మాత్రమే పరిమితమైనవి కావని గ్రహించారు.

ఈ తత్వవేత్త అంటే నాటి పాలకులకు గిట్టేది కాదు. నిజానికి ఆయనంటే భయం బయలుదేరింది. ఆనాటి పాలకులు, రాజకీయ నాయకులు సామాన్య ప్రజల మధ్య నెలకొన్న మూఢ నమ్మకాలను ఆసరా చేసుకుని వాటి సాయంతో అధికారం చెలాయించసాగారు. శాసనాలు ఎంత దారుణంగా ఉన్నప్పటికీ ఎదురుతిరగడానికి ప్రజలు సిద్ధంగా లేరు. అలాంటి కాలఘట్టంలో సోక్రటీసు బోధనల కారణంగా ప్రజలు తమ సమస్యలను కొత్త వెలుగులో పరిశీలించడం మొదలు పెట్టారు. పాలకులచర్యలను ప్రశ్నించసాగారు. ఏథెన్స్ నగరాన్ని నూతన ఆలోచనా తరంగం ముంచెత్తసాగింది.

ఆఖరికి పాలకులు – యువతరాన్ని సోక్రటీసు చెడగొడుతున్నాడని ఆయన మీద నిందారోపణ చేశారు. మరణశిక్ష విధించాలని నిర్ణయించారు. ఆ మహనీయుడి చివరి ఘడియల గురించి మన పాఠకులు చాలా మందికి తెలిసే ఉంటుంది. ఆయనకు ఒక గిన్నెలో



'హెమ్లాక్' అనే విషాన్ని ఇచ్చారు. చుట్టూ కూర్చున్న శిష్యులు దీనవదనాలతో విలపిస్తు న్నారు. అప్పుడాయన, ''మీరు మరికొంత సేపట్లో నగరంలోకి వెళతారు; నేను మరేదో తెలియని ప్రదేశానికి వెళతాను. అయితే, మీరు వెళ్ళే చోటు ఉత్తమమైనదో నేను వెళ్ళే చోటు ఉత్తమమైనదో ఎవరికి తెలుసు?'' అన్నాడు.

మరణసమయంలో సైతం ఆయన కనబరచిన గుండెనిబ్బరం, ప్రశాంతత అసాధారణమైనవి. ఆయన ఎల్లప్పుడూ అలాగే ప్రవర్తించేవాడు. ఒట్టిగొప్పలు చెప్పుకునేవారినైతే ఆయన పరిహసించేవాడు; హాస్యమాడేవాడు. అయితే, ఎప్పుడూ ఆగ్రహించేవాడు మాత్రం కాడు.



ఒకనాడాయన తన ఇంటి ముందు కొందరు యువకులతో కూర్చుని వాళ్ళడిగే ప్రశ్నలకు సమాధానాలు చెబుతూ, ఎదురు ప్రశ్నలు వేస్తూ, సమస్యలకు పరిష్కారాలు కనుగొనడం ఎలాగో వారికి బోధిస్తున్నాడు. అలా కొన్ని గంటలు గడిచాయి. ఇంట్లో నుంచి ఆయన భార్య చాలా సార్లు పిలిచింది. లోపల ఏదో ముఖ్యమైన ఇంటిపనికి ఆయన సాయం కావలసివచ్చింది. అయితే, తత్వవేత్త చర్చలో నిమగ్నమై ఉండడం వల్ల ఆ పిలుపును పట్టించుకోలేక పోయాడు. లోపలికి వెళదామని ఒకటి రెండుసార్లు లేవబోయాడుగాని, యువకులు అడిగిన ఆసక్తికరమైన ప్రశ్నలకు సమాధానాలు చెబుతూ అక్కడే ఉండిపోయాడు.

ఇంట్లోని భార్యకు కోపం పెరిగిపోయి గట్టిగా కేకలు పెట్టసాగింది. ఆమె అరుపులు ఉరుముల్లా వినిపించాయి. ఆఖరికి ఆమె ఒక బకెట్ నిండుగా నీళ్ళు తెచ్చి భర్త తలమీద కుమ్మరించింది. ఆయన చుట్టూవున్న యువకులు దిగ్భ్రాంతి చెందారు. ఆవేశం చెందారు. కాని సోక్రటీసు మాత్రం వాళ్ళ కేసి చిన్నగా నవ్వుతూ, ''చూశారా! మనం మామూలుగా నిజాలని చెప్పుకునేవి నిజంకాక పోవచ్చు అనడానికి ఒక ప్రత్యక్ష నిదర్శనం ఇప్పుడు లభించింది. ఉరిమే మేఘం వర్షించదని అందరూ చెబుతారు. అయితే, ఇప్పుడు మీరు కళ్ళెదుట చూసిందేమిటి? నిజానికి ఉరిమే మేఘం కూడా వర్షిస్తుంది. అవునా? ఇవాళ్టికి ఇది చాలు. ఇక వెళ్ళిరండి. తరవాత కలుద్దాం,'' అన్నాడు.

శ్రోతలందరూ ఫక్కున నవ్వారు. సోక్రటీసు కూడా నవ్వాడు. మొదట కాస్త ఇబ్బందిగా చూసినప్పటికీ, ఆ తరవాత ఆయన భార్య కూడా నవ్వడం విశేషం! -(ఎం.డి)

# చందమామ క్విజ్ - 1

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

Co-sponsored by Infosys FOUNDATION, Bangalore

ఈ నెల క్విజ్ మతాలకూ, చారిత్రక ప్రదేశాలకూ సంబంధించినది.

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే : 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ క్విజ్ - 1 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. ఫిబ్రవరి నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. ఏప్రిల్ 2008 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.



1. వ్యర్థ పదార్థాలతో అందమైన వస్తువులను తయారుచేసి ప్రదర్శనకు ఉంచిన 'ఉద్యాన వనం' ఎక్కడ ఉన్నది?
2. అది నిజానికి దేవాలయం కాదు. అయితే అక్కడ మత సామరస్యాన్ని చాటే దేవాలయం, చర్చ్, మసీదులను పోలిన శిల్పాలు ఉన్నాయి. అది ఎక్కడ ఉన్నదో తెలుసా?
3. 170 అడుగుల ఎత్తులో 120 మెట్లగుండా లోపలికి వెళ్ళే ద్వారం ఉన్నది. ఒక ముస్లిం పాలకుడి దక్కను విజయానికి గుర్తుగా ఇది నిర్మించబడింది. దాన్ని చూడాలంటే ఎక్కడికి వెళ్ళాలి?
4. మన దేశంలో మొట్టమొదటి జాతీయోద్యానానికి-మొదట వేటగాడుగా ఉండి ఆ తరవాత వన్యమృగాల పరిరక్షకుడిగా మారిన ఒక వేటగాడి పేరు పెట్టబడి ఉన్నది. ఎవరాయన? పార్క్ ఎక్కడ ఉన్నది?
5. 500 సంవత్సరాలనాటి ఒక ఆలయ సమీపంలోని కొలను తాబేళ్ళకు ప్రసిద్ధిగాంచింది. వాటిని భక్తి శ్రద్ధలతో పూజిస్తారు. వాటి పేరు మీదుగానే ఆలయం కూడా ఉన్నది. కొలను, ఆలయాల పేర్లేమిటో తెలుసా?

# గుడ్లగూబల భాష

అక్బర్ చక్రవర్తిని చూడగానే ఆయన మనోగతం బీర్బల్‌కు అర్థమైపోయింది. ఆయన స్వారీకి అనువైన దుస్తులను తొడుక్కుని ఎదుట తివాచీ మీద పరచిన పదునైన కత్తులనూ, ఈటెలనూ ఆసక్తితో పరిశీలిస్తున్నాడు. బీర్బల్ వంగి సలాం చేశాడు. అక్బర్ దృష్టి ఆయుధాల మీదే ఉండడంతో తల పంకించి కొంత సేపయ్యాక, ''ఆహా! అద్భుతమైన ఆయుధాలు!'' అన్నాడు మనసులో గొణుక్కుంటూన్నట్టు.

అక్బర్‌కు వేటంటే మహా ఇష్టం. వేటాడి తెచ్చిన పులుల, లేళ్ళ తలలతో భవనమంటపాన్ని అలంకరించడం అంటే ఆయనకు మహా సరదా. అయితే, అడవిలో ఎక్కడో వాటి మానాన బతికే వన్యమృగాలను వేటాడడం అంటే బీర్బల్‌కు ఏమాత్రం ఇష్టం లేదు. తను వేటకు వెళ్ళకుండా ఉండడమే గాక, చక్రవర్తికి వేటపట్ల ఆసక్తిని తగ్గించడానికి ఏదైనా మార్గం ఉందా అని బీర్బల్ తీవ్రంగా ఆలోచించసాగాడు.

''బీర్బల్, నేనిప్పుడు ఏంచేయబోతున్నానో తెలుసా?'' అని అడిగాడు అక్బర్.

''ఎదుటివారి మనసులను చదివే విద్య నాకు తెలియదు కదా ప్రభూ!'' అన్నాడు బీర్బల్ చిన్నగా నవ్వుతూ.

''నీకా తెలియదు! ఎండ బాగా కాస్తున్నది. చల్లటి గాలులు వీస్తున్నాయి. వేటాడడానికి ఈ రోజు చాలా అనుకూలంగా ఉంటుంది. ఏమంటావు?'' అని అడిగాడు అక్బర్.

''ప్రభువుల కోరికలే మాపాలిటి ఆజ్ఞలు కదా!'' అన్నాడు బీర్బల్.

''అంటే, నువ్వూ మాతో వేటకు వస్తున్నావు. అవునా?'' అన్నాడు అక్బర్.

''ప్రభువుల ఆనందమే, మా ఆనందం!'' అన్నాడు బీర్బల్ వినయంగా.





లైన సాధుప్రాణులు ప్రాణభీతితో అరణ్యంలోపలికిపరుగులు తీశాయి. రాజపరివారం వాటిని వెంటబడి తరుమసాగింది.

ఎత్తయిన చెట్లు దట్టంగాగల ఒక సమతల ప్రాంతాన్ని అక్బర్ చేరాడు. కొద్ది దూరంలో భయంకరమైన ఒక పులి ఆయన కేసి రావడం కనిపించింది. దాని కళ్ళు నిప్పుకణికల్లా కణ కణలాడుతున్నాయి. డప్పుల చప్పుడు దానికి ఆగ్రహం కలిగించింది. ఆయుధాలు ధరించిన పలువురు ఒక్కసారిగా దాన్ని చుట్టుముట్టడంతో అది ఒక్క క్షణం అలాగే నిలబడింది. వెనక్కు తిరిగి వెళ్ళే మార్గం లేదు. దిక్కులు ప్రతిధ్వనించేలా గాండ్రించింది. పంజా ఎత్తి, కోరల నోటిని భయంకరంగా తెరుచుకుని అక్బర్ మీదికి ఉరకబోయింది.

అక్బర్ ఈటెను పైకెత్తి పులి నోటిని గురిచూసి తన శక్తి కొద్దీ విసిరాడు. అంతే! ఈటె పులినోట్లోకి దిగడంతో పులి అలాగే నేల మీదికి దభీమని పడిపోయింది. నోటి నుంచి నెత్తురు వెల్లువలా ప్రవహించ సాగింది. అక్బర్ గుర్రంపై నుంచి కిందికి దూకి, కత్తి దూసి పులి వద్దకు పరిగెత్తాడు. అయితే కత్తికి పని పెట్టకుండా విలవిలా తన్నుకుని పులి అప్పటికే చచ్చిపోయింది. అక్బర్ విజయోత్సాహంతో కత్తిని పైకెత్తి చూపాడు. పరివారమంతా ఆనందంతో, ''అల్లాహో అక్బర్!'' అంటూ నినదించింది.

''నీకు వేట అంటే ఇష్టం లేదని నాకు తెలుసు. నువ్వు చాలా తెలివైనవాడివి. సమయస్ఫూర్తితో చతురోక్తులు విసరగల సమర్థుడివి. అయితే, శారీరకంగా నువ్వు ఏపాటి బలవంతుడివో నాకు తెలియదు. నువ్వు మాతో వేటకు వస్తే అదీ తెలిసిపోతుంది,'' అన్నాడు అక్బర్ మందహాసం చేస్తూ.

''చిత్తం, ప్రభూ,'' అన్నాడు బీర్బల్ వంగి సలాం చేస్తూ.

బీర్బల్‌తో సహా పరివారం వెంటరాగా, అక్బర్ దృఢమైన గుర్రం మీద వేటకు బయలు దేరాడు. నగరం దాటి ఒక గంట తరవాత వాళ్ళు అడవిని సమీపించారు. అక్కడ రకరకాల శబ్దాలు పుట్టించి వన్యమృగాలను తమ స్థావరాల నుంచి వెడలగొట్టే డప్పులు మోగించేవాళ్ళు విభిన్న వాయిద్యాలతో రాజుగారి పరివారంతో వచ్చి కలిశారు. వాళ్ళు పుట్టించిన శబ్దాలతో అరణ్యం దద్దరిల్లింది. పక్షులు ఎగిరాయి. పొదలలో దాక్కున్న కుందేళ్ళు, జింకలు మొద

సాయంకాలానికల్లా అక్బర్ మరొక పులిని కూడా చంపాడు. అందరూ విశ్రాంతి కోసం ఒక సెలయేటి వద్దకు చేరారు. భోజనాలయ్యాక, అక్బర్, ''ఇక్కడి ప్రకృతి సౌందర్యం నాకెంతో నచ్చింది. మరి కొంతసేపు ఇక్కడే గడిపివస్తాను, మీరు వెళ్ళండి,'' అని పరివారంతో చెప్పి, ''బీర్బల్, నువ్వు నాతో పాటు ఉండగలవా?'' అని అడిగాడు.

''చిత్తం, ప్రభూ!'' అంటూ వంగి నమస్కరించాడు బీర్బల్.

ఇద్దరూ ఒక చెట్టుకింద కూర్చున్నారు. కొంత సేపటికి సూర్యాస్తమయమై చీకటిపడసాగింది. అప్పుడప్పుడు పక్షుల కిలకిలారావాలు తప్ప, వాతావరణం ఎంతో ప్రశాంత గంభీరంగా ఉంది. మరికొంత సేపటికి అప్పుడప్పుడు గుడ్లగూబల కూతలు వినిపించసాగాయి. రెండు గుడ్లగూబలు ఒకటి తరవాత ఒకటి అరవడం గమనించిన అక్బర్, ''మనకు గుడ్లగూబల భాష తెలియదు. అవేం మాట్లాడుకుంటున్నాయో తెలియడం లేదు. అవి ఒక వేళ మనల్ని పరిహసిస్తున్నవేమో,'' అన్నాడు సరదాగా.

''నాకు వాటి భాష తెలుసు ప్రభూ! అవేం చర్చించు కుంటున్నాయో చెప్పమన్నారా?'' అన్నాడు బీర్బల్ మెల్లగా.

''తెలిస్తే చెప్పుమరి. ఆలస్యం దేనికి?'' అన్నాడు అక్బర్.

''అవి కట్నం గురించి చర్చించుకుంటున్నాయి ప్రభూ. వరుడి తండ్రిగుడ్లగూబ అసలు జంతువులంటూ లేని నలభై అడవులు కట్నంగా అడుగుతున్నది. వధువు తండ్రిగుడ్లగూబ ఇరవై అడవులు మాత్రమే ఏర్పాటు చేయగలను అంటున్నది ప్రభూ,'' అన్నాడు బీర్బల్.

అలా అంటున్నప్పుడే ఒక గుడ్లగూబ అరిచింది. ''వరుడి కుటుంబం మరో ఆరునెలలు వేచివుండే పక్షంలో మరో ఇరవై అడవులను జంతువులు లేకుండా ఏర్పాటు చేయగలను అంటున్నది వధువు తండ్రిగుడ్లగూబ,'' అన్నాడు బీర్బల్ మళ్ళీ.

''అదెలా సాధ్యం? ఇరవై అడవుల నుంచి ఒక గుడ్లగూబ జంతువులన్నిటినీ ఎలా తరమగలదు? అసాధ్యం!'' అన్నాడు అక్బర్.

''ఆ విషయంలో తమరు సాయపడగలరని ఆ గుడ్లగూబ భావిస్తోంది ప్రభూ,'' అన్నాడు బీర్బల్.

''ఏమంటున్నావు నువ్వు?'' అని గద్దించాడు అక్బర్.

''ప్రభూ, తమరు ఒకసారి వేటకు వస్తే



ఒకటి రెండు అడవులు ఖాళీ అయిపోతున్నాయట. మరో ఆరు నెలలలో మీరు కనీసం ఇరవై సార్లయినా వేటకు రాగలరని వధువు తండ్రి గుడ్లగూబ ఆశిస్తోంది ప్రభూ!'' అన్నాడు బీర్బల్ అమాయకంగా.

అక్బర్ ఆ మాటకు గతుక్కు మని కొంతసేపు మౌనం వహించి ఆ తరవాత, ''భలే చెప్పావు బీర్బల్! నాకళ్ళు తెరిపించావు. జంతువులు, చెట్టు చేమలు లేకుంటే అడవులు అడవులుగా ఉండవు. వన్యమృగా లను వేటాడ్డంలోని పొరబాటును గ్రహించాను. మళ్ళీ వేటకు రానని నీకు మాట ఇస్తున్నాను, బీర్బల్!'' అన్నాడు అక్బర్ సాలోచనగా.

బీర్బల్ తన చెవులను తానే నమ్మలేక పోయాడు. ఇంత తొందరగా అక్బర్ చక్రవర్తిలో అంత పెద్ద మార్పు వస్తుం దని ఊహించలేదు గనక, ఏం చెప్పడానికీ తోచక మౌనంగా ఊరు కున్నాడు.

''ఇప్పుడేం చెబుతోందా గుడ్ల గూబ?'' అని అడిగాడు అక్బర్ మళ్ళీ నవ్వుతూ.

''వధువు తండ్రిగుడ్లగూబ- రాజుగారు వేట మానేశారు గనక, నువ్వు అడిగే అడవులు ఇవ్వలేను- అంటున్నది ప్రభూ!'' అన్నాడు బీర్బల్.

''భలేవాడివి బీర్బల్!'' అంటూ అక్బర్ బిగ్గరగా నవ్వాడు.

## మన దేశం క్విజ్

### ఈ ప్రముఖులను గుర్తు చేసుకుందాం



1. భారత స్వాతంత్ర్యానికి పూర్వమే మన త్రివర్ణ పతాకం ప్రప్రథమంగా ఒక విదేశంలో ఆవిష్కరించబడింది. ఆవిష్కరించిన వారెవరు? ఎక్కడ?



2. ఆయన ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్. సోవియట్ యూనియన్‌కు వెళ్ళిన తొలి భారత రాయబారి. ఆ తరవాత మనదేశ ప్రథమ పౌరుడు. ఆయన ఎవరు?



3. ఆయన నోబెల్ బహుమతీ గ్రహీత. ఒక విశ్వవిద్యాలయ సంస్థాపకుడు. ఆయన ఎవరు?




4. మొదట కేంద్రంలో ఆర్థిక మంత్రిగా ఉండి, ఆ తరవాత రాష్ట్రపతి అయ్యాడు. ఆయన ఎవరు?



5. స్వాతంత్ర్యానికి పూర్వం ఒక ఇండియన్ ప్రావిన్స్‌కు ముఖ్యమంత్రి. ఐక్య రాజ్యసమితి జనరల్ అసెంబ్లీకి అధ్యక్షత వహించిన మన దేశానికి చెందిన ఏకైక వ్యక్తి ఎవరు? ఆ ప్రావిన్స్ ఏది?

(సమాధానాలు 74వ పేజీలో)

## కేరళ జానపద కథ

# తెలివిగల వదినె

శివన్ ఉన్నత కుటుంబంలో పుట్టాడు. అన్నయ్య శంకరన్ పుట్టిన పదేళ్ళ తరవాత అతడు తల్లిదండ్రులకు రెండవ బిడ్డగా కలిగాడు. శివన్ పసివాడుగా ఉన్నప్పుడే అతడి తల్లి తీరని వ్యాధికి గురయింది. పడకపై నుంచి లేవలేని స్థితికి చేరుకున్నది. ఆమె ఒకనాడు భర్తనూ, పిల్లలనూ దగ్గరికి పిలిచి, పెద్ద కొడుకుతో, ''నాయనా శంకరన్. నువ్వు నీ తమ్ముణ్ణి తండ్రిలాగా చూసుకోవాలి. ఇదే నా చివరి కోరిక,'' అని చెప్పి శివన్ చేతిని శంకరన్ చేతిలో పెట్టి కన్నుమూసింది.

శంకరన్ యుక్తవయస్కుడయ్యాక, అతని తండ్రి మంచి సంప్రదాయ కుటుంబానికి చెందిన పార్వతి అనే యువతితో అతని పెళ్ళి జరిపించాడు. ఆమె భర్తకు అనురాగవతి అయిన భార్యగా, మామగారికి బాధ్యతగల కూతురులా, పసివాడైన శివన్‌కు వాత్సల్యం గల తల్లిగా మసలుకుంటూ అచిరకాలంలోనే అందరి ఆదరాభిమానాలకూ పాత్రమయింది.

పార్వతి పసివాడి పట్ల ప్రత్యేకశ్రద్ధ కనబరచేది. రోజూ అతడి అవసరాలు చూసుకుంటూ బడికిపంపేది. బడినుంచి రాగానేఅతనికికావలసినఫలహారాలు చేసి పెట్టేది. భర్తగాని, మామగారు గాని శివన్ గురించి ఏమాత్రం విచారం చెందకుండా జాగ్రత్తపడేది. శివన్ అందమైన యువకుడుగా పెరిగిపెద్దవాడయ్యాడు.

చదువు పూర్తయ్యాక శివన్‌ను ఉద్యోగానికి పంపడానికి ఆమె ఇష్టపడలేదు. మామగారు ఏవో పనుల మీద రాజుగారినీ, అధికారులనూ కలుసుకోవడానికి తరచూ రాజధానికి వెళుతూ ఉంటాడు. భర్త ఆస్తిపాస్తులను చూసుకుంటూ అద్దెలు వసూలు చేయడంలో తలమునకలుగా ఉంటాడు. అందువల్ల శివన్‌కు పెళ్ళి చేస్తే ఇంట్లో తన పనిపాటులు





పంచుకోవడానికి ఒక ఆడతోడు లభిస్తుందని ఆశించింది పార్వతి.

ఒకనాడామె శివన్‌తో ఆ విషయం ప్రస్తావించినప్పుడు - తను గౌరి అనే అమ్మాయిని గుడిలో చూసి ఇష్టపడ్డానని అతడు చెప్పాడు. పార్వతి కూడా గౌరిని అంతకు ముందే చూసింది. చాలా అందమైనపిల్ల. సంప్రదాయ బద్ధమైన ధనికకుటుంబానికి చెందినది. అందువల్ల శివన్‌కు ఈడూ జోడూగా ఉంటుందని సంతోషించింది. వెంటనే గౌరిని చూసి తన మనసులోని మాటను చెప్పమని శివన్‌కు సలహా ఇచ్చింది.

మరునాడే శివన్ గౌరి ఇంటికి వెళ్ళాడు. గౌరిని చూసి ఆమెను పెళ్ళాడాలన్న తన కోరికను తెలియజేశాడు. ఆ మాటవిని ఆమె ఆశ్చర్యపడలేదు. అతణ్ణి అంతకు ముందే చూసి ఉండడంవల్లా, అతడు ఉన్నత కుటుంబానికి చెందిన విద్యావంతుడని తెలియడం వల్లా, అతణ్ణి పెళ్ళాడడానికి గౌరికి సంతోషంగా ఉంది. అయినా అతని ప్రతిపాదనను వెంటనే అంగీకరించకుండా కొంత బెట్టు చేయాలని అనుకున్నది.

''నీకొక పరీక్షపెడతాను. అందుకు నీకు అభ్యంతరం లేదుకదా?'' అని అడిగింది గౌరి. ''లేదు,'' అన్నాడు శివన్. ఆమె ఇంట్లోకి వెళ్ళి ఒక పాత్రను తీసుకువచ్చి, ''ఇందులో ఆవాలు, నువ్వులు కలిసి ఉన్నాయి. వాటిని వేరు చేసి రేపు ఉదయం నువ్వులు మాత్రం తీసుకు రా,'' అన్నది. శివన్ ఆ పాత్రను తీసుకుని ''ఏమిటీ అల్ప పరీక్ష,'' అనుకుంటూ ఇంటి కేసి బయలుదేరాడు.

ఇంటి గుమ్మంలోనే అతన్ని చూసినపార్వతి, ''ఏమయింది శివన్? గౌరిని చూశావా? ఏమిటా పాత్ర?'' అని అడిగింది.

శివన్ గౌరిని చూసిన విషయం చెప్పి, ''ఆమెనన్ను పెళ్ళి చేసుకోవడానికి ఇష్టపడుతోంది ఒప్పోల్ (అక్కయ్యా). అయినా నాకొక పరీక్ష పెడతానంటూ ఈ పాత్ర ఇచ్చింది. ఇందులో ఆవాలు, నువ్వులు ఉన్నాయి. వీటిని తెల్లవారే సరికల్లా వేరు చేసి, నువ్వులు తీసుకురమ్మన్నది. రాత్రంతా మేలుకుంటే తప్ప అది అంత సులభంగా కనిపించడం లేదు,'' అన్నాడు.

గౌరి చాలా తెలివైన అమ్మాయి అని పార్వతి వెంటనే గ్రహించింది. ఆమె నవ్వుతూ, ''నువ్వేం విచార పడకు. అది తెల్లవారే సరికి

సిద్ధంగా ఉంటుంది,'' అంటూ పాత్రను తీసుకుని పెరట్లోకి వెళ్ళింది. ఒక నౌకరును పిలిచి, చెట్టు నుంచి ఒక చీమలగూడును తెమ్మని చెప్పింది. కొన్నిరకాల చీమలు ఆకులతో కొమ్మల మధ్య గూళ్ళు కట్టి వాటిలో నివసిస్తాయి. నౌకరు గూటిని తీసుకురాగానే పార్వతి చీమలను పాత్రలో వదిలి, పాత్రను అక్కడే పెట్టి వచ్చింది.

మరునాడు తెల్లవారేసరికి చీమలు ఆవాలన్నిటినీ తినేశాయి. నువ్వులు మాత్రం మిగిలి ఉన్నాయి. చీమలు వాటిని తినవు. పార్వతి శివన్‌ను పిలిచి పాత్రను చేతికిచ్చింది. తన వదినె, గౌరికన్న చాలా తెలివైనదని శివన్ గ్రహించాడు.

అతడు వేగంగా వెళ్ళి ఆ పాత్రను గౌరికి ఇచ్చాడు. ఆమె చిన్నగా నవ్వి, ఇంట్లోకి వెళ్ళి మరో ఖాళీ పాత్రను తెచ్చి శివన్‌కు ఇస్తూ, ''దీని నిండా మంచు నింపుకుని తెల్లవారేసరికి రాగలవా?'' అన్నది.

శివన్ దాన్ని అందుకుని నిరుత్సాహంతో వెనుదిరిగాడు. ''ఆవాలు, నువ్వులు వేరు చేయడం సులభం. తెల్లవారేసరికి ఈ పాత్రనెలా మంచుతో నింపడం? బహుశా వదినె దీనికేదైనా మార్గం చూపగలదు,'' అనుకుంటూ నడవసాగాడు.

మరో పాత్రతో శివన్ నిరుత్సాహంగా నడిచి రావడం చూసి పార్వతి తెల్లబోయింది. ''మళ్ళీ పరీక్షా?'' అని అడిగింది.

''అవును,'' అంటూ శివన్ జరిగినదంతా వివరించాడు. ''ఫరవాలేదు. విచారించకు (అనియా) తమ్ముడూ! దానికీ ఏదో ఒక ఉపాయం కనుగొందాం,'' అన్నది పార్వతి.

ఆమె స్థానికులైన రజకులను పిలిపించి, ''మీరు నాకొకసాయం చేయాలి. మీ దగ్గరున్న బట్టలన్నిటినీ రాత్రి తెల్లవార్లూ మంచులో ఆరబెట్టండి. తెల్లవారు జామున బట్టలలో చేరిన మంచును బానలోకి పిండి తీసుకు రండి,'' అన్నది. సరేనని వాళ్ళు వెళ్ళారు. మరునాడు చెప్పినట్టే బానలో మంచునీళ్ళు తీసుకువచ్చారు. పార్వతి దాన్ని శివన్ తెచ్చిన పాత్రలో నింపి, గౌరికి పంపింది.

శివన్ దాన్ని తీసుకుపోయి గౌరికి ఇచ్చి, ''ఇప్పుడు నీకు సంతోషం అనుకుంటాను,'' అన్నాడు.

పాత్రలో స్ఫటికంలా తేటగా ఉన్న నీటిని చూసి గౌరి చిన్నగా నవ్వుతూ, ''చాలా



సంతోషం. అయితే నీకు మరో పరీక్ష పెట్టాలను కుంటున్నాను. నాకు వంద లేత తమల పాకులు కావాలి. వాటిని తాజాగా కోసుకు రావాలి. అయితే, అలా ఆకులు తుంచ డానికి చేతినిగానీ, కత్తినిగానీ ఉపయోగించ కూడదు,'' అన్నది.

''చేతినీ, కత్తినీ ఉపయోగించకుండా లేత తమలపాకులను కోయడం ఎలాగా? అసాధ్యం!'' అనుకుంటూ విచారంతో ఇల్లు చేరిన శివన్‌వాలకం చూసి, ''ఈ రోజు ఎలాంటి పరీక్ష పెట్టిందేమిటి?'' అని అడిగింది పార్వతి.

శివన్ చెప్పిన విషయం విని, ''ఆమెకు తృప్తి కలిగించడానికి ఏదైనా ఉపాయం ఆలో చిస్తాను. పరీక్షలు ఇంతటితో అయిపోయాయా?



ఇంకా ఉన్నాయా? అని తెలుసుకోవడానికి నేను రేపు నీతోపాటు అక్కడికి వస్తాను,'' అన్నది ఆమె.

పార్వతి తీవ్రంగా ఆలోచించడంతో ఆమెకో ఆలోచన మెరుపులా తోచింది. ఆమె ఒక చిలుకను పెంచుతున్నది. ఆమె ఆ చిలుకను పెరట్లో వున్న తమలపాకుల తోటలోకి తీసుకు వెళ్ళి వదిలిపెట్టింది. చిలుక అటు ఇటూ ఎగురుతూ ముక్కుతో తమలపాకులను తుంచసాగింది. పార్వతి ఆకులను సేకరించి, వాటి నుంచి వంద లేత తమలపాకులను విడిగా తీసి పెట్టింది. ఆ తరవాత చిలుకను బోనులోకి పంపింది.

ఆ మరునాడు పార్వతి శివన్‌తో కలిసి గౌరి ఇంటికి బయలుదేరింది. ఆమెను చూడగానే గౌరి-శివన్‌ను అన్ని పరీక్షలకు గురి చేసినం దుకు ఇబ్బందిగా తలదించుకున్నది. ''చేచీ (అక్కయ్యా), నన్ను అపార్థం చేసుకోకండి. మీ అనియన్ ఈ పరీక్షల్లో నెగ్గక పోయినా, నేను అతణ్ణే పెళ్ళాడి ఉండేదాన్ని. నేను అతనిలాంటి వ్యక్తిని వేరెవర్నీ చూడలేదు; నన్ను క్షమించండి,'' అన్నది.

పార్వతి ఆమెను ఆప్యాయంగా కౌగిలించు కుని, 'నేను మాత్రం అతడు వేరే అమ్మాయిని పెళ్ళాడడానికి అనుమతించేదాన్ననుకు న్నావా?'' అన్నది.

గౌరి తల్లిదండ్రులతో మాట్లాడాక శివన్-గౌరిపెళ్ళి ఘనంగా జరిగింది. పార్వతి తెలివి తేటలనూ, శివన్‌పట్ల ఆమెకున్న శ్రద్ధనూ భర్త శంకరన్, మామగారు ఎంతగానో మెచ్చు కున్నారు.



# సూర్యునితో పందెం

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో ఒకప్పుడు, చిత్రకూట పర్వత ప్రాంతాన తొంభైవేల హంసలు నివసిస్తూ ఉండేవి. ఆ కాలమందే బోధిసత్వుడు ఒక హంసగా జన్మించాడు. ఆ హంస అనేకమైన సుగుణాలతోపాటు అపరిమితమైన వేగం కలిగివుండటంచేత, తొంభైవేల హంసలకూ అది పెద్ద అయింది. ఇన్ని ఉత్తమ గుణాలూ, శక్తులూ వుండడం వల్ల ఆ హంసల పెద్దకు 'రాజహంస' అని పేరు.

ఒకనాడు రాజహంస, తన గుంపుతో సహా, సరోవరంలో విహరించి నివాసానికి మరలుతూ, కాశీరాజ్యం గుండా రావడం తటస్థించింది. బ్రహ్మాండమైన ఆ పక్షుల గుంపును చూస్తే, కాశీరాజ్యమంతటా బంగారు చాందినీ పరిచినట్టుగా వుంది. కాశీరాజు ఆశ్చర్యంతో అటు పరికించాడు. ఆ పక్షులన్నిటిలోనూ, చుక్కలలో చంద్రుడిలా వెలిగిపోయే రాజహంస కాశీరాజును మరింత ఎక్కువగా ఆకర్షించింది.

ఆ రాజహంసలో మంచి ఠీవీ, తేజస్సూ మొదలైన రాజలక్షణాలు ఉండటం కాశీరాజు గమనించాడు. సేవకుల చేత దివ్యమైన పుష్పమాలికలూ, పూజాద్రవ్యాలూ తెప్పించి, వాటితో రాజహంసకు స్వాగత మిచ్చాడు.

ఘనమైన ఆ స్వాగతాన్ని ఆప్యాయతతో అందుకొన్నది రాజహంస. తన పరివారంతో సహా కొన్నాళ్ళు అక్కడ వుండి, కాశీరాజు ఆతిథ్యం పొంది, నివాసానికి మరలిపోయింది.

ఆ క్షణం నుంచీ కాశీరాజుకు రాజహంస పైన గల మమత మరింత అతిశయించసాగింది. ఇప్పుడాయన మనస్సంతా రాజహంసపైనే ఉంటున్నది. అహర్నిశలు దానిని గురించే తలంపు. ఏ క్షణమందు ఏ దిశ

జాతక కథ



నుంచి ఆ రాజహంస వస్తుందో అని వెయ్యి కళ్ళతో కనిపెట్టి చూస్తూ వుండేవాడు.

ఒకనాడు చిత్రకూట పర్వత ప్రాంత మందలి హంసలలో రెండు చిన్నారి హంసలు రాజహంస వద్దకు వచ్చి, ''రాజా! మా ఇద్ద రికీ ఎంతో కాలంగా సూర్యునితో పందెం కడదామని సరదాగా వుంది,'' అంటూ, వాటి మనస్సులోని ఉద్దేశం వెల్లడించినై.

ఈ మాటకు రాజహంస, ''ఓసీ, కూన ల్లారా! సూర్యుడితో ఏమిటి, మీరు పందెం కట్టడ మేమిటి? విడ్డూరం! సూర్యుని వేగం ఎంతటిదో మీకు తెలియదు. కనుకనే అజ్ఞా నంలో పడ్డారు. మీరు ఆయనతో పరుగెత్త లేరు సరికదా, పందెంలో మీకు ప్రమా దమూ, ప్రాణాపాయమూ కూడా కలగ వచ్చు. అందుచేత ఇంతటితో మీరిద్దరూ మీ పిచ్చి ఊహలు కట్టిపెట్టండి,'' అని నెమ్మ దిగా హితవు చెప్పింది. హంసపిల్లలకు ఈ హితవు నచ్చలేదు. మళ్ళీ మరొకనాడు పోయి రాజహంసను అనుమతి కోరినై. ఈసారీ అలానే చెప్పింది రాజహంస.

అంతటితోనైనా ఊరుకోకుండా మూడో సారి పోయి మళ్ళీ అడిగినై పిల్లలు. ఈమారూ రాజహంస అంగీకరించలేదు.

ఇది పని కాదని తలచి, తమ సత్తువ తెలి యని హంసపిల్లలు రెండూ, యజమానికి తెలియకుండానే యుగంధర పర్వత శిఖరా నికి ఎగిరిపోయినై. ఈ శిఖరం సూర్యమండ లాన్ని తాకుతున్నదా అనిపించేటంత ఎత్త యింది. కనుక ఆ పెద్ద పర్వత శిఖరం మీద చేరి, సూర్యునితో పందెం వేద్దామని హంస పిల్లలు అనుకున్నవి.

యథాప్రకారం రాజహంస తన పరివా రాన్ని లెక్క చూసుకోగా రెండు హంసలు తగ్గినై. జరిగిన సంగతి గ్రహించి, అది ఎంత గానో విచారించింది. వాటిని ఎలా ఐనా రక్షిం చాలనుకున్నది.

వెంటనే తను కూడా యుగంధర పర్వత శిఖరానికి చేరుకుని, హంసపిల్లలకు తెలి యని విధంగా ఒకచోట కూర్చున్నది. సూర్యో దయం కాగానే హంసపిల్లలు సూర్యునితో పాటు, ఎగరసాగినై. రాజహంస కూడా వాటిని అనుసరించింది.

హంసపిల్లలు రెండింటిలో చిన్నది మధ్యాహ్నం వరకూ ఎగిరి, రెక్కలలో మంట పుట్టి, సోలి పడిపోయింది. పడి పోయేట

ప్పుడు దానికి రాజహంస కనబడగా, ''రాజా! నావల్ల కాలేదు. ఓడిపోయాను...'' అన్నది నిస్పృహతో.

అప్పుడు రాజహంస, ''ఫరవాలేదు, నేనున్నానుగా!'' అంటూ దానిని రెక్కలపై ఎక్కించుకుని వచ్చి తమ నివాసస్థానంలో తక్కిన గుంపుతో చేర్చింది.

మరి కొంచెం సేపటికి రెండవ హంస పిల్లకు కూడా రెక్కలలో సూదులు పొడిచినట్టు బాధకలిగి, సొలిపోయింది. అదీ రాజహంసను చూసి నిస్పృహతో దీనంగా పలికింది. దానికి కూడా రాజహంస ధైర్యం చెప్పి, రెక్కలపై ఎక్కించుకొని, తమ నివాస స్థానమైన చిత్రకూటం చేర్చింది.

ఈ విధంగా తన పరివారంలోని రెండు పక్షులు ఓడిపోవటం సహించలేక, రాజహంస తనే పందెం వేయాలని బయల్దేరింది. చెప్పనలవికాని సహజ వేగం గల రాజహంస ఎగరడం ప్రారంభించిన కొద్ది సేపట్లోనే సూర్యబింబాన్ని కలుసుకోవడం, దాటిపోవడమూ కూడా జరిగింది! సూర్యుని సత్తువ ఎంతటిదో చూదామనుకొన్నది కాని, రాజహంసకు పందెం ఎందుకు? దీనివల్ల దానికి కలిసివచ్చేదేమిటి?

కనుక, ఇష్టం వచ్చినట్టు కొంచెం సేపు చుట్టి చుట్టి, చివరకు అలసటచేత భూలోకానికి దిగివచ్చి, కాశీరాజ్యం చేరుకున్నది. కన్నులు కాయలు కాచేటట్టు కనిపెట్టుకుని వున్న కాశీరాజు రాజహంసను చూడగానే తన్మయుడైపోయాడు.



రాజహంసను తన బంగారు సింహాసనం మీదకూర్చోబెట్టి, బంగారు పళ్ళెంతో పాయసం, బంగారు కలశంతో చల్లటి పానకం తెచ్చి దానిముందు పెట్టాడు. అది కొంచెం స్థిమితపడ్డ తరువాత రాజు కుశలప్రశ్నలు ప్రారంభించాడు. జరిగిందంతా వివరించింది రాజహంస.

అది చెప్పినదంతా విన్న రాజు, ''పక్షిరాజా! సూర్యునితోనే పందెం కట్టి, అతనిని మించిన నీ ప్రజ్ఞ ఎటువంటిదో చూడవేడుకగా వున్నది,'' అన్నాడు. అప్పుడు రాజహంస రాజుకు తన శక్తిని చూపించదలిచి, ''రాజా! నీ రాజ్యంలో, మెరుపు మెరిసేటంతకన్న వేగంగా బాణం వదలగల మేటి విలుకాండ్రు వుంటే, వారిలో నలుగురిని ఇక్కడికి రప్పించు,'' అన్నది. రాజు విలుకాండ్రను పిలిపించాడు. ఉద్యానవనంలో ఒక నలుచదరపు స్తంభం

ఉన్నది. విలుకాండ్రు నలుగురినీ ఆ స్తంభం నాలుగువైపులా నించో బెట్టింది రాజహంస.

తరవాత తన మెడకు ఒక గంట కట్టుకుని, స్తంభం పైన కూర్చుని, ''నేను సంజ్ఞ చేయ గానే మీరు నలుగురూ బాణాలు వదలండి. నేను ఎగిరి వెళ్ళి, మీ ఒక్కొక్కరి బాణమే తెచ్చి మీ ముందు పెడతాను. ఐతే, నా మెడలో ఉండే గంట చప్పుడువల్లనే మీరు నా గమ నాన్ని తెలుసుకోగలరు గాని, నన్ను కంటితో చూదామంటే ఎంతమాత్రం సాధ్యం కాదు,'' అని చెప్పింది.

ఆ ప్రకారమే, మెరుపు మెరిసేటంతలో విలుకాండ్రు వదిలిన నాలుగు బాణాలూ తెచ్చి రాజహంస, వాళ్ళ ముందు పెట్టింది.

రాజూ, పరివారమూ ఆశ్చర్యభరితుల య్యారు. ''రాజా! చూశావా నా వేగం! ఇది, నేను అతి మెల్లగా ఎగిరినప్పటి కనీసపు వేగం అన్నమాట. దీన్నిబట్టి అసలు, వేగం అనేది ఎటువంటిదో ఊహించగలవేమో చూడు,'' అన్నది.

ఆత్రంతో రాజు, ''పక్షిరాజా! నీ వేగం ఎటువంటిదో మచ్చు చూడగలిగాము. మరి, ఇంతకు మించిన వేగం మరెవరికైనా ఉన్నదా?'' అని ప్రశ్నించాడు.

అందుకు రాజహంస, ''లేకేమి! నేను నా శక్తి అంతా వినియోగించి అత్యంత వేగంగా ఎగిరినప్పటికీ, నా కంటె వెయ్యి రెట్లు వేగంతో పరుగుతీసే మహాశక్తి ఒకటి ఉన్నది. అదే కాలం అనే సర్పం! ఆ కాలసర్పం అను క్షణమూ ఈ ప్రపంచ మందలి జీవులను వర్ణింప తరంకాని ప్రచండ వేగంతో నాశనం చేస్తున్నది...'' అని చెప్పేసరికి, రాజు భయంతో కంపించిపోయాడు.

అప్పుడు రాజహంస రూపంలో వున్న బోధిసత్వుడు కాశీరాజుకు ఈ విధంగా తత్వ బోధ చేశాడు:

''రాజా! కాలసర్పం ఒకటి ఉన్నదన్న మాట గుర్తుంచుకొన్నవాళ్ళకు భయపడ వలసినపనే లేదు. నీతిమంతుడివై, ధర్మాత్ము డివై, పరిపాలన సాగించేటంతవరకూ నీకు ఎవ్వరివల్లనూ ఎట్టి భయమూ లేదు. కనుక నీ విధులు నువ్వు సక్రమంగా నెరవేర్చుకో.''

బోధిసత్వుడు చెప్పిన హితవు ప్రకారం కాశీరాజు ధర్మపాలనచేసి, గొప్పకీర్తి గడించాడు.





# రామాయణం

రాముడు దుఃఖంతో మూర్ఛపోయి ఉన్న తారను చూశాడు. అది గమనించి వానరులు తారను వాలి శరీరం మీది నుంచి పట్టి లేవదీశారు. తార రాముణ్ణి చూసి అతణ్ణి సమీపించి, ''రామా, నా భర్త ప్రాణాలు తీసిన బాణంతోనే నన్ను కూడా చంపి, నా భర్త వద్దకు చేర్చు. సీత కోసం నువ్వు ఎలా తపిస్తున్నావో, వాలి నా కోసం ఆ లోకంలో అలా తపిస్తాడు. భార్యా వియోగం ఏమిటో నీకు తెలుసుగదా! వాలి పోయాక నేను జీవచ్ఛవాన్నే గనక స్త్రీ హత్యాదోషం నిన్నంటదు,'' అంటూ ఏడ్చింది. రాముడు తారనూ, సుగ్రీవుణ్ణీ యథోచితంగా ఊరడించాడు. వాలి దహన క్రియల పని చూడమని లక్ష్మణుడు సుగ్రీవుణ్ణి హెచ్చరించాడు. తారుడు కిష్కింధకు వెళ్ళి వాలిని మొయ్యటానికి ఒక పల్లకీ తెచ్చాడు. సుగ్రీవుడూ, అంగదుడూ వాలిని ఎత్తి పల్లకీలో పడుకోబెట్టారు. బలిష్ఠులైన వానరులు పల్లకి మోస్తూ వెళ్ళారు. ఒక వాగు ఒడ్డున ఇసుక ప్రదేశంలో వాలికి చితి ఏర్పాటయింది. అంగదుడు శాస్త్రోక్తంగా చితికి నిప్పు పెట్టాడు. వానరులు వాలికి జలతర్పణాలు విడిచారు.

ఉత్తరక్రియలు పూర్తి కాగానే సుగ్రీవుడు తడి బట్టలతో, తన మంత్రులను వెంటబెట్టుకుని రాముడి వద్దకు వచ్చాడు. అప్పుడు హనుమంతుడు రాముడితో, ''మీ అనుగ్రహం చేత సుగ్రీవుడు వానర రాజ్యాన్ని పొందగలిగాడు. అతనిక రాజ్యభారం వహించవలిసి ఉన్నది. మీరు వచ్చి అతనికి సక్రమంగా పట్టాభిషేకం చేయించండి,'' అన్నాడు.

కిష్కింధా కాండ - 4



దానికి రాముడు, ''హనుమంతుడా, తండ్రి ఆనతి ప్రకారం నేను పద్నాలుగేళ్ళ పాటు గ్రామాలలోకీ, నగరాలలోకీ అడుగు పెట్ట వీలులేదు. అందుచేత మీరంతా సుగ్రీవుణ్ణి కిష్కింధకు తీసుకుపోయి శాస్త్రప్రకారం పట్టాభిషిక్తుణ్ణి చెయ్యండి,'' అన్నాడు. రాముడు సుగ్రీవుడితో అంగదుణ్ణి యువ రాజును చెయ్యమనీ, వర్షాకాలం ఆరంభం కాబోతున్నది గనుక వానలు పోయేదాకా తానూ, లక్ష్మణుడూ ఋశ్యమూకం మీది గుహలో ఉంటామనీ, కార్తీకమాసం ఆరంభ మయ్యేటప్పుడు సుగ్రీవుడు రావణుడిపై యుద్ధయత్నాలు ఆరంభించవలసి ఉంటుం దనీ చెప్పాడు.

సుగ్రీవుడు కిష్కింధకు వెళ్ళి యథా విధిగా పట్టాభిషేకం చేసుకున్నాడు. కిష్కింధ వాసులందరూ సంతోషించారు. గజుడూ, గవాక్షుడూ, గవయుడూ, శరభుడూ, గంధ మాదనుడూ, హనుమంతుడూ, జాంబవంతుడూ, నళుడూ బంగారు కలశాలతో సుగ్రీవుణ్ణి అభిషేకించారు.

తన పట్టాభిషేకం పూర్తి కాగానే సుగ్రీవుడు అంగదుడికి యౌవరాజ్య పట్టాభిషేకం చేసి, అంగదుడిపై ఆదరాభిమానాలు గల కిష్కింధ పౌరులకు ఆనందం కలిగించాడు. తరవాత అతను రామలక్ష్మణుల వద్దకు వెళ్ళి జరిగిన దంతా చెప్పి, కిష్కింధకు తిరిగి వచ్చి తన భార్య అయిన రుమతో సుఖంగా కాలం గడుప సాగాడు.

సుగ్రీవుడు రాజ్యాభిషిక్తుడైనాక రామలక్ష్మణులు తమ నివాసాన్ని ప్రస్రవణ పర్వతం పైన ఉండే ఒక విశాలమైన గుహకు మార్చుకు న్నారు. ఈ గుహ అన్ని విధాలా సౌకర్యంగా ఉన్నది. గుహలోకి వానజల్లు రాదు, ఈదురు గాలి రాదు. పరిసరాలు ఎంతో అందంగా ఉన్నాయి. సమీపంలోనే నది ఉన్నది. అదీ కాక ఈ గుహ కిష్కింధకు చాలా దగ్గిర; కిష్కింధ లోని గీత వాద్య ధ్వనులూ, వానరుల కేకలూ ఆ గుహకు వినిపిస్తున్నాయి.

ఇలాటి గుహలో రాముడు అహోరాత్రాలు సీతకై విరహం పొందుతూ, లక్ష్మణుడి చేత హెచ్చరించబడుతూ, సుగ్రీవుడు ప్రత్యుపకారం చెయ్యకపోతాడా అని ఆశ్చర్య పడుతూ, ఈ నాలుగు మాసాలూ గడిచి శరత్కాలం ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తూ కాలం గడపసాగాడు.

వానాకాలం వచ్చింది, వెళ్ళింది. సుగ్రీవుడు తన భార్య అయిన రుమతో కలిసి సుఖభోగాలలో మునిగి తేలుతూ, రాజ్య భారం మంత్రులపై వేసి, రామకార్యం నిర్వర్తించే సమయం వచ్చిందన్న మాటకూడా తల పెట్టలేదు.

అందుచేత హనుమంతుడు సుగ్రీవుడి వద్దకు వచ్చి, ''నీకు రాజ్యమూ, కీర్తీ లభించాయి. శత్రుభయం ఏమీలేదు. కాని మన మిత్రుల పని చూడవలిసిన బాధ్యత అలాగే ఉండిపోయింది. ఇలాటి పనులలో జాప్యం కూడా తప్పే. అందుచేత వెంటనే సీతను వెతికే పని ప్రారంభించు. నీ సహాయం కోసం ఎంత ఆత్రంగా ఎదురు చూస్తున్నప్పటికీ, భార్యా వియోగంతో ఎంతగా తపించి పోతున్నప్పటికీ రాముడు నీ బాధ్యతను జ్ఞాపకం చెయ్యటం లేదు. అతను అడగక ముందే మనం పని ప్రారంభిస్తే మనకు అలక్ష్యదోషం ఉండదు. నీ మాట నువ్వు నిలబెట్టుకుంటావనే ఉద్దేశంతో అతను ఎదురు చూస్తున్నాడు. ఇంక ఆలస్యం చెయ్యటం భావ్యం కాదు,'' అన్నాడు. ఈ హెచ్చరికతో సుగ్రీవుడు చైతన్యం పొందాడు. అతను నీలుణ్ణి పిలిచి సైన్యాలన్నిటినీ రప్పించమని ఆజ్ఞాపించాడు; ఏ వానరుడు గాని పదిహేను రోజుల లోపుగా కిష్కింధకు చేరక పోతే వాడికి మరణదండన విధించమన్నాడు; జాంబవంతాదుల దగ్గిరికి అంగదుణ్ణి వెంట బెట్టుకుని నీలుణ్ణిస్వయంగా వెళ్ళమన్నాడు.

ఒకనాడు లక్ష్మణుడు ఫలాల కోసం కొండ కోనలన్నీ చెడతిరిగి వచ్చేసరికి రాముడు



అగాధమైన దుఃఖంలో మునిగి ఉన్నాడు. అతనికి శరత్కాలంతోబాటు సీతా వియోగ బాధ కలిగి దుఃఖం ముంచుకొచ్చింది. లక్ష్మణుడు తన అలవాటు ప్రకారం రాముణ్ణి ఊరడించి, దుఃఖం నిరుపయోగమనీ, కర్తవ్యం నెరవేర్చటానికి ధైర్యమూ, ఉపాయమూ కావాలనీ జ్ఞాపకం చేశాడు.

అంతా విని రాముడు, ''లక్ష్మణా, వానాకాలం వెళ్ళి శరత్కాలం వచ్చింది. ఈ నాలుగు నెలలూ ఎంతో బాధతో గడిపాను. రాజులు యుద్ధాలకు బయలుదేరే సమయం వచ్చినా సుగ్రీవుడి జాడలేదు. అతను ఏ ప్రయత్నం లోనూ ఉన్నట్టు కనపడడు. అతనికి నా మీద ఇంకా దయ రాలేదు. 'రాముడు దిక్కులేనివాడు, రాజ్యభ్రష్టుడు, అడవుల పాలై, భార్యను రావణుడపహరించగా దైన్యంతో



మన శరణు జొచ్చాడు,' అని సుగ్రీవుడు నన్ను అనాదరంగా చూస్తున్నట్టున్నాడు. లేక తన పని గడిచిందిగదా అని తాను చేసిన వాగ్దానాన్ని మరిచాడో! నువ్వు కిష్కింధకు వెళ్ళి నేను చెప్పినట్టుగా అతనితో చెప్పు: అన్న మాట నిలబెట్టుకోని వాడు పురుషాధముడు. ప్రత్యుపకారం చెయ్యని వాడి శవాన్ని కాకులూ గద్దలూ కూడా ముట్టవు. అతనికి నా బాణంయొక్క ధ్వని మళ్ళీ వినాలని ఉన్నదేమో! ఇందుకేనా ఈ సుగ్రీవుడితో నేను స్నేహం చేసి, వాలిని చంపింది? వాలిని ఒక్కణ్ణే చంపాను, ఈ సుగ్రీవుణ్ణి బంధువులతో సహా చంపగలను. అందుచేత నువ్వు సుగ్రీవుడితో ఎలా చెప్పాలో అలా చెప్పు,'' అన్నాడు.

లక్ష్మణుడికి కూడా సుగ్రీవుడిపై పట్టరాని ఆగ్రహం వచ్చింది. అతను రాముడితో, ''నీ మూలానే తనకు రాజ్యప్రాప్తీ, భార్యాప్రాప్తీ కలిగిందని కూడా తలచకుండా ఆ సుగ్రీవుడు, తాగి భార్యలతో తల కిందులై పోతున్నాడు. ఇలాటివాణ్ణి రాజుగా ఉండనివ్వరాదు. ఇప్పుడే వెళ్ళి వాణ్ణి వాలి దగ్గిరికి పంపించేస్తాను; సీతను వెతకటానికి అంగదుడున్నాడు, వానర వీరులున్నారు,'' అన్నాడు బాణాలు తీసుకుని బయలుదేరుతూ.

రాముడు లక్ష్మణుడితో శాంతంగా, ''లక్ష్మణా, తొందరపడకు. మిత్రవధ చేసి నిష్కారణంగా పాపం అంటగట్టుకోకు. సుగ్రీవుడు అన్న సమయానికి రాకపోవటం తప్ప వేరే మహాపరాధం ఏం చేశాడు? నువ్వు వెళ్ళి అతనితో మృదువుగానే మాట్లాడు,'' అని అతణ్ణి పంపేశాడు.

లక్ష్మణుడు కిష్కింధ చేరి సుగ్రీవుడి ఇంటికి బయలుదేరాడు. అణగని కోపంతోనూ, అతి వేగంతోనూ పోతున్న లక్ష్మణుణ్ణి చూసి పెద్ద పెద్ద వానర వీరులు, అతనెవరో శత్రువనుకుని, అతని పైన వెయ్యటానికి చెట్లు పీకారు. అది చూసి లక్ష్మణుడు వారికేసి నిప్పులు కక్కుతూ చూశాడు. దానితో వారు భయపడి దూరంగా తొలగారు. కొందరు సుగ్రీవుడి ఇంటికి వెళ్ళి లక్ష్మణుడు వస్తున్నాడని చెప్పారు. కాని భార్యతో సరస సల్లాపాలలో మునిగి ఉన్న సుగ్రీవుడా మాట వినిపించుకోలేదు.

ఈలోపల సుగ్రీవుడి మంత్రులు, లక్ష్మణుడు నిజంగా వస్తున్నాడేమో చూసి రమ్మని కొందరు వానరులను పంపారు. వాళ్ళతో

బాటు వచ్చిన అంగదుణ్ణి చూసి లక్ష్మణుడు, ‘‘నేను వచ్చానని సుగ్రీవుడితో చెప్పు, నాతో మాట్లాడతాడో లేదో, తెలుసుకుని వెంటనే రా!’’ అన్నాడు. అంగదుడు సుగ్రీవుడి వద్దకు వెళ్ళి, నమస్కారం చేసి, లక్ష్మణుడు చెప్ప మన్నట్టే చెప్పాడు. కాని సుగ్రీవుడు తాగిన మత్తులో ఉండి ఏమీ వినిపించుకోలేదు. అయితే, లక్ష్మణుడి రౌద్రాకారం చూసి వాన రులు చేసిన కలకలానికి సుగ్రీవుడి మత్తు కొంత వదిలింది.

అంగదుడు అవతలికి వెళ్ళి ప్లక్షుడూ, ప్రభావుడూ అనే మంత్రులతో సుగ్రీవుడి వద్దకు తిరిగి వచ్చేసరికి అతను కొంత స్పృహలో ఉన్నాడు. వారు అతనితో లక్ష్మణుడు మాట్లాడ టానికి వచ్చాడని చెప్పారు. లక్ష్మణుడు ధనుర్బాణాలతో సహా వచ్చాడనీ, చాలా కోపంలో ఉన్నాడనీ సుగ్రీవుడికి తెలిసింది.

సుగ్రీవుడు మంత్రులతో, ‘‘నేనేమీ తప్పు చేయలేదే, లక్ష్మణుడికి ఆగ్రహం ఎందుకు కలిగి ఉంటుందీ? నా శత్రువు లెవరో అతనితో నాపై చాడీలు చెప్పి ఉంటారు. మీ తెలివి తేటలన్నీ ఉపయోగించి అతని కోప కారణం తెలుసుకోవాలి. రామలక్ష్మణులంటే నాకు భయమని కాదు, కాని మిత్రుడికి కోపం వచ్చినప్పుడు ఆందోళన చెందటం సహజం. రాముడు చేసిన ఉపకారానికి ప్రత్యుపకారం చెయ్యటం నాకు సాధ్యంకాదు,’’ అన్నాడు.

అప్పుడు హనుమంతుడు సుగ్రీవుడితో, ‘‘రాజా, రాముడికి నీ మీద అలక వచ్చి ఉంటుందేగాని నిజమైన ఆగ్రహం రాదు.



నువ్వు ఏమరుపాటున శరదృతువు రావటం గమనించలేదు. అందుకే లక్ష్మణుడు వచ్చి ఉంటాడు. అతను కాస్త పరుషంగా మాట్లాడినా నువ్వు సహించాలి, ఎందుకంటే తప్పు నీదే. రాముడికి ఆగ్రహం తెప్పించటం ఎవరికీ మంచిది కాదు; అతని వల్ల లాభం పొందిన నీకు అది బొత్తిగా అనుచితం,'' అన్నాడు.

ఈలోపుగా లక్ష్మణుడు సుగ్రీవుడి అంతఃపురం దాకా వచ్చి, లోపల ఆడవాళ్ళ అలికిడి విని అక్కడే ఆగిపోయాడు. లక్ష్మణుడు చేసిన ధనుష్టంకార ధ్వని విని సుగ్రీవుడు అతని ఎదట పడడానికి జంకి, లక్ష్మణుడితో మాట్లాడమని తారను పంపాడు.

తార లక్ష్మణుడున్న చోటికి వచ్చి, ''మీకు కోపం వచ్చిందిట, దేనికీ? మీ మాటను ఎవరైనా అతిక్రమించారా?'' అని అడిగింది.

''సుగ్రీవుడు అస్తమానమూ తాగి ఉండి రాచకార్యాలు చూడడు, మా సంగతి ఆలోచించడు, నీకు తెలియదా? యుద్ధ సన్నాహానికి నాలుగు మాసాలు వ్యవధి తీసుకున్నాడు. గడువు దాటిపోయింది. మా పని ప్రారంభం కాలేదు. మేమేం చెయ్యాలో నువ్వే చెప్పు,'' అన్నాడు లక్ష్మణుడు.

తార అతనితో, ''సుగ్రీవుడు భోగలాలసుడై ఉన్నందుకు ఆగ్రహించ వద్దు. అతను మీ పని మరవలేదు. ఇదివరకే అతను మీ పనికి వానరులను హెచ్చరించాడు. ఎక్కడెక్కడి పర్వతాల నుంచో వానరులు లక్షల, కోట్ల సంఖ్యలో వచ్చి చేరారు,'' అని చెప్పి అతన్ని తనవెంట అంతఃపురంలోకి తీసుకుపోయింది.

కాని తీరా లక్ష్మణుడు లోపలికి వెళ్ళే సరికి సుగ్రీవుడు, తాగిన మత్తులో ఎర్రబడిన కళ్ళతో, అనేకమంది స్త్రీల నడుమ కనిపించాడు. లక్ష్మణుడికి అతన్ని చూడగానే మండిపోయింది. అతను సుగ్రీవుణ్ణి చూసి, ''తనకు ఉపకారం చేసిన మిత్రులకు అబద్ధపు ప్రతిజ్ఞ చేసేవాడు పరమపాపి. కృతఘ్నుడు. వాణ్ణి ఎవరైనా చంపవచ్చు. రాముడి చేత నీ పని పూర్తి చేయించుకుని సీతను వెతికే ప్రయత్నం ప్రారంభించని నువ్వు కృతఘ్నుడవు. వాలి వెళ్ళిన దారి జ్ఞాపకం ఉంచుకుని సీత కోసం వెతికించు,'' అన్నాడు.





# బంగారు బాతుగుడ్లు

ఒక నగరంలో రాముడు అనే పేద యువకుడు ఉండేవాడు. వాడికి నా అన్న వారెవరూ లేరు. వాడికి ఉన్నదల్లా ఒక కొంపా, ఒక కోడి పెట్టా. రాముడు పగలల్లా నగరంలో కూలి పనులు చేసి, ఆ డబ్బుతో తన పొట్ట నింపుకునేవాడు. ఒక్కరోజు సంపాదన దొరక్కపోతే తన కోడి పెట్టిన గుడ్లు ఉడకేసుకు తిని, మంచి నీళ్ళు తాగి, తృప్తిగా పడుకునేవాడు.

రాముడి ఇంటి పొరుగున గవరయ్య అనేవాడు ఉండేవాడు. గవరయ్య దురాశాపరుడే గాక; ఒకరు పచ్చగా ఉంటే చూసి ఓర్చలేనివాడు. రాముడు చిల్లిగవ్వ చెయ్యకపోయినా, ఉన్నది తిని నిశ్చింతగా తిరుగుతూ ఉండటం గవరయ్యకు కడుపు మంటగా ఉండేది. బాగా బలిసి, కొవ్వుపట్టి ఉన్న రాముడి కోడి పెట్టను చూసి కూడా గవరయ్య అసూయ పడేవాడు.

ఒకనాడు రాముడు ఇంటిలో లేని సమయంలో గవరయ్య ఆ కోడిని పట్టి, కోసి వండుకుని తినేశాడు.

రాముడు ఇంటికి వచ్చి చూసేసరికి కోడిపెట్ట లేదు. దాని ఈకలూ అవీ పొరుగువాడి ఆవరణలో కనిపించాయి.

రాముడు గవరయ్య వద్దకు వెళ్ళి, ''నా కోడిని ఏమి చేశావు?'' అని అడిగాడు.

''మా పిల్లి ఎక్కడి నుంచో ఒక కోడిని తెచ్చి, తినబోయింది. నేను ఆ కోడిని కాపాడదామనుకున్నాను. ఆ కోడి చావనే చచ్చింది. ఇక చేసేదిలేక వండుకు తిన్నాను. ఆ కోడి నీదేనని నాకేం తెలుసు?'' అన్నాడు గవరయ్య.

రాముడు మండిపడి, ''మర్యాదగా నా కోడిని నాకిస్తావా? రాజుగారి దగ్గిర ఫిర్యాదు చెయ్యమన్నావా?'' అని గవరయ్యను అడిగాడు.

**25-ఏళ్ళనాటి చందమామ కథ**

గవరయ్య భయపడ్డాడు. ఎందుకంటే, రాజు న్యాయం చెయ్యటంలో దయాదాక్షిణ్యాలు చూపేవాడు కాడు. గవరయ్యకు జరిమానా గాని, ఖైదుశిక్ష గాని పడి తీరుతుంది. ఏదో విధంగా రాముడితో రాజీ పడటమే మంచిదని గవరయ్య, రాముడికి ఒక బాతుపిల్లను ఇస్తూ, ''నీ కోడికి బదులుగా దీన్ని పట్టుకుపో,'' అన్నాడు.

బంగారం లాంటి కోడి పోయినా, బాతుపిల్ల అయినా దొరికినందుకు రాముడు ఊరటపడ్డాడు. కొంత కాలానికి బాతుపిల్ల పెరిగి గుడ్లు పెట్టసాగింది. ఇంతలో వర్షాకాలం వచ్చింది. ఒకనాటి రాత్రి వర్షం జోరున కురుస్తూండగా ఒక ఫకీరు వచ్చి, గవరయ్య ఇంటి తలుపు తట్టాడు.

''ఎవరదీ? వేళాపాళా లేదూ? ఈ వర్షంలో నీకు తలుపెవరు తీస్తారు? వెళ్ళు, వెళ్ళు,'' అని ఫకీరుతో అని, గవరయ్య ముసుగుతన్ని పడుకున్నాడు.

ఫకీరు వచ్చి రాముడి ఇంటి తలుపు తట్టాడు. రాముడు తలుపు తెరిచి, తడిసి పోయి చలికి వణుకుతున్న ఫకీరును చూసి, లోపలికి రమ్మని, అతడికి పొడిబట్టలిచ్చి, చలి కాచుకోవటానికి చితుకులమంట వేశాడు. ఆ మంట మీదనే రెండు బాతుగుడ్లు ఉడకబెట్టి, రాముడు ఫకీరుకు తినమని ఇచ్చాడు.

''బాతుగుడ్లు చాలా రుచిగా ఉన్నాయి. నాయనా! ఏదీ నీ బాతు?'' అని ఫకీరు రాముణ్ణి అడిగాడు. రాముడు గంప కింది నుంచి బాతును తెచ్చి ఫకీరుకు చూపాడు.






''దేవుడు నీకు మేలుచేస్తాడు, నాయనా!'' అంటూ ఫకీరు బాతును నిమిరి, వర్షం తగ్గి పోవటం చేత, ఆ చీకట్లోనే వెళ్ళిపోయాడు.

ఆ మర్నాటి నుంచీ ఆ బాతు మామూలు గుడ్లకు బదులు బంగారుగుడ్లు పెట్టసాగింది. దానితో రాముడి దరిద్రం తీరిపోయింది. వాడు కూలికి వెళ్ళటం మానుకుని, బాతు పెట్టే బంగారంతో తాను తిని, మిగిలినది దానధర్మాలు చేయసాగాడు. కాని వాడా పూరికొంపను మాత్రం విడిచిపెట్టలేదు.

గవరయ్యకు రాముడి జీవితంలో ఏదో మార్పు కలిగినట్టు తెలిసింది, కాని అది ఎలా కలిగినదీ తెలియలేదు. అతను రాముడి మీద ఒక కన్నువేసి ఉంచాడు.

ఒకరోజు రాముడు బాతు ఉండే గంపకింది నుంచి ఒక బంగారు గుడ్డు తియ్యటం గవరయ్య కంటపడింది. వెంటనే గవరయ్య గుండె అసూయతో అవిసిపోయింది. అది తన బాతే అయి ఉండటంచేత గవరయ్య కడుపుమంట మరింత అయింది.

''నా బాతును నాకిచ్చెయ్యి,'' అంటే రాముడు ఇవ్వడు. అందుచేత, గవరయ్య తన నౌకర్లను ఇద్దరిని వెంటబెట్టుకుని రాజు గారి దర్బారుకు వెళ్ళి, ఆయన న్యాయవిచారణ జరిపే సమయంలో, ''మహారాజా, నా పొరుగున ఉన్న రాముడనేవాడు నా బాతులను చాలా కాలంగా కాజేస్తున్నాడు. అవి ఒకటొకటే పోతుంటే ఏ గండుపిల్లో కాజేస్తున్నదనుకున్నాను. కాని నిన్న రాత్రి రాముడు నా బాతును కాజేస్తూ ఉండగా ఈ మనుషులిద్దరూ చూశారు. ఏలినవారు నా బాతును తిరిగి ఇప్పించాలి,'' అన్నాడు.

రాజుగారు తన భటులను పంపి, రాముణ్ణి బాతుతో సహా దర్బారుకు పిలిపించాడు.

''నువ్వు నిన్నరాత్రి ఇతని బాతును దొంగిలించావట, నిజమేనా?'' అని రాజు రాముణ్ణి అడిగాడు.

గవరయ్యకు బాతు రహస్యం తెలిసిపోయిందని రాముడికి అర్థమయింది.

''మహారాజా, నేను దొంగతనం చెయ్యలేదు. ఇది ఇతని బాతే, కాని కొంతకాలం క్రితం నా కోడిని కాజేసి, చంపి తిని, దానికి బదులుగా నాకీ బాతును ఇచ్చాడు,'' అన్నాడు రాముడు.

''అబద్ధం! నిన్న ఈ మనిషి దొంగతనం చేస్తూండగా చూసిన ఈ ఇద్దరు సాక్షులూ

ఉన్నారు. వాడు చెప్పేదానికి సాక్షులెవరు?'' అన్నాడు గవరయ్య.

రాజుగారు, ''ఈ బాతును ప్రస్తుతానికి నా వద్ద ఉంచి, రేపు మీరిద్దరూ రండి, తీర్పు చెబుతాను,'' అని గవరయ్యనూ, రాముణ్ణీ పంపేశాడు.

ఆ రోజు కూడా ఆ బాతు రాజుగారి దగ్గిర బంగారు గుడ్డు పెట్టింది. రాజుగారు తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. ఈ రహస్యం ఫిర్యాదీలకు తెలిసే ఉండాలి. వారినుంచే నిజం రాబట్టదలిచాడు రాజు.

మర్నాడు రాజుగారి దర్బారుకు గవరయ్యా, రాముడూ వచ్చారు.

రాజుగారు గవరయ్యకు ఒక మామూలు బాతుగుడ్డు చూపుతూ, ''నీ బాతు ఈ ప్రమాణం గల గుడ్లు పెడుతుందా?'' అని అడిగాడు.

''ఇంతకన్న ఇంకాస్త పెద్ద గుడ్లే పెడుతుంది, మహారాజా!'' అన్నాడు గవరయ్య.

రాజు అదే ప్రశ్న రాముణ్ణి అడిగాడు. ''అది మామూలు గుడ్లు పెట్టదు, మహారాజా. నా బాతు రోజుకొక బంగారు గుడ్డు పెడుతుంది,'' అన్నాడు రాముడు.

గవరయ్య తెలివిగా, ''ఎంత అబద్ధం! బాతు ఎక్కడన్నా బంగారు గుడ్లు పెడుతుందా?'' అన్నాడు.

''నీ మాట నిజం! అది నీ బాతే. దాన్ని నువ్వు తీసుకువెళ్ళు,'' అని రాజు గవరయ్యకు మామూలు బాతు నొకదాన్ని ఇచ్చి పంపేశాడు. తనకు న్యాయం జరగనందుకు విచారిస్తూ నిలబడిన రాముడితో రాజు, ''దిగులు పడకు. నీ బాతు నా వద్దనే ఉన్నది. అది బంగారు గుడ్లు పెట్టటానికి కారణం ఏమిటి?'' అన్నాడు.

రాముడు ఫకీరు సంగతి అంతా రాజుకు చెప్పాడు. రాజు ఆశ్చర్యపడి, రాముణ్ణి బాతుతో సహా తన దివాణంలోనే ఉండి పొమ్మన్నాడు.

గవరయ్య తీసుకుపోయిన బాతు మామూలు గుడ్లే పెట్టింది. రాముడికి దివాణంలో ఉద్యోగమయిందని తెలియగానే, తనకు తగిన శాస్తి జరిగిందనుకున్నాడు గవరయ్య.



చిత్రాలు: గాంధి అయ్య



# అజేయుడు గరుడుడు!



ఆదిత్యుడు ధీరసేనుడితో కలిసి సూర్యపురి
సేనలతో వజ్రపురి కోటను ముట్టడించాడు.
ఆలయానికి తిరిగిరమ్మని ఆదిత్యుడికి పిలుపు వచ్చింది.
మహారాజు మానవేంద్రుడి అభీష్టానుసారం ఆలయంలో
అరుణ-ఆదిత్యుల వివాహం నిరాడంబరంగా జరిగింది.

దేవాలయం నుంచి వెలుపలికి వచ్చాక...

మహారాజా! నేను వజ్రపురికి వెళ్ళి తలపెట్టిన కార్యాన్ని పూర్తిచేసుకుని రెండు మూడు రోజులలో తిరిగివస్తాను. అరుణను మీరు రాజధానికి తీసుకువెళ్ళండి.

ఆదిత్యుడు ఆ మహత్కార్యాన్ని పూర్తి చేయడం అవసరం.

అలాగే ఆదిత్యా! అరుణ రావడానికి సమ్మతిస్తే, వెంటబెట్టుకు వెళతాను.

యువరాజు త్వరలో తిరిగిరాగలరని ఆశిస్తున్నాను.

మహారాజు, అరుణ బయలుదేరారు. ఆదిత్యుడు, రాజగురువు వారిని చూస్తూ నిలబడ్డారు.







ఆదిత్యుడు శిబిరాన్ని సమీపిస్తుండగా, దాని మీద ఒక డేగ వృత్తాకారంలో ఎగరడం గమనించాడు.
నన్ను హెచ్చరించడానికి వస్తున్నదా ఏం?


నా భద్రత పట్ల నీకు అమితమైన శ్రద్ధ కదూ?


డేగ ఆదిత్యుడి భుజం మీద వాలింది.
నన్ను రక్షించడానికి నువ్వు ఉన్నందున నాకెలాంటి విచారమూ లేదు.


గుడారంలోకి ప్రవేశించిన ఆదిత్యుడు అక్కడ మంత్రి పుష్పరాజ్, ధీరసేనుడు వర్తలలో ఉండడం చూశాడు.
మేము చంద్రపురి నుంచి ఉపసంహరించుకుంటాం. మరి రవీంద్ర దేవుడి మాటేమిటి?
అతన్ని మాకు వెంటనే అప్పగించాలి. ఆహా! యువరాజు ఆదిత్యుడు వచ్చేశారు!


డేగ అరవడంతో అందరూ బిత్తరపోయారు.


డేగ! అదెందుకు నన్నలా చూస్తోంది?


డేగ ఆదిత్యుడి భుజంపై నుంచి హఠాత్తుగా ఎగిరి వెళ్ళి పుష్పరాజ్ మీద దాడి ప్రారంభించింది.
అయ్యో! కాపాడండి! నన్ను కాపాడండి!!


ఆదిత్యుడు దిగ్భ్రాంతి చెందాడు.
అతన్ని వదిలెయ్!


పుష్పరాజ్‌ను డేగ రెక్కలతో బాదసాగింది.


ఆదిత్యా! నువ్వు చెప్పినట్టు వింటాను. డేగను వెనక్కు పిలువు!


హడలిపోయిన పుష్పరాజ్, వజ్రపురి రాజు రూపొందించిన దుష్ట పథకం గురించి చెప్పేశాడు.
మారాజు నరేంద్రదేవుడి పక్షపాతి. అతని కుమారుడు చంద్రపురి సింహాసనం అధిష్ఠించాలని ఆశించాడు. అతన్ని మళ్ళీ గుహాలయానికి తీసుకువెళ్ళాడు.
నువ్వు సేనాధిపతి ధీరసేనుడికి లొంగిపో! నేను రవీంద్రదేవుణ్ణి వెంబడిస్తాను.


ఒంటరిగా వెళ్ళకండి. నా సైనికులను వెంటబెట్టుకుని వెళ్ళండి.
ఇతన్ని సూర్యపురిలో బందీగా ఉంచండి. నేను గుహాలయానికి వెళ్ళి రాజునూ, రవీంద్రదేవుణ్ణీ పట్టుకుంటాను.


రాజు విక్రమసింహుడు, రవీంద్రదేవుడు రహస్యమార్గం గుండా అడవిని చేరుకున్నారు.
మనం గుర్రాలపై గుహాలయం చేరుకుందాం.


రహస్య మార్గం చివర...
వెంటనే రెండు గుర్రాలను తీసుకురండి!
చిత్తం, మహాప్రభూ!


రాజు విక్రమసింహుడు, రవీంద్రదేవుడు గుర్రాలపై గుహాలయంకేసి బయలుదేరారు.


గుహాలయం చేరాక...
నాన్నా! తృటిలో తప్పించుకున్నాం! రాజుగారికి రహస్య మార్గం తెలుసు!
ఇప్పుడితడు క్షేమంగా ఉన్నాడు. ఇతన్ని అప్పగించమని ఆదిత్యుడు కోరాడు.


భూతవైద్యా! వెంటనే ఆదిత్యుణ్ణి సర్వ నాశనం చేయడానికి గురువుగారి శక్తిని ఉచ్చాటనం చెయ్! ఏమాత్రం సమయం వృథాచేయకు.
చిత్తం, చిత్తం! ఇప్పుడే ఆలయంలోకి వెళతాను.


మేము ధీరసేనుణ్ణి నమ్మాం. అయితే, అతడు శత్రువు ఆదిత్యుడితో చేతులు కలిపాడు. నేను ఇప్పుడు తిరిగి వెళ్ళి...


ఆ ఇద్దరికీ సరైన గుణపాఠం నేర్పుతాను! నరేంద్రా, తండ్రిగారిని జాగ్రత్తగా చూసుకో. నేను త్వరలో సందేశం పంపుతాను.

-(ఇంకావుంది)

మన వారసత్వ స్థలాలు

# చోళులు నిర్మించిన మూడు దేవాలయాలు


తంజావూరు బృహదీశ్వరాలయం


గంగైకొండ చోళపురంలోని బృహదీశ్వరాలయం


దారాసురంలోని ఐరావతేశ్వరాలయం

తంజావూరులోని బృహదీశ్వరాలయం, గంగైకొండ చోళపురంలోని మరో బృహదీశ్వరాలయం, దారాసురంలోని ఐరావతేశ్వరాలయం - ఈ మూడు ఆలయాలను 'సజీవ' దేవాలయాలుగా అభివర్ణిస్తారు. 11,12 శతాబ్దాలలో దక్షిణ భారతదేశాన్ని పరిపాలించిన చోళులు దీనిని నిర్మించారు.

తంజావూరులోని బృహదీశ్వరాలయాన్ని క్రీ.శ. 10వ శతాబ్దంలో రాజరాజ చోళుడు నిర్మించాడు. దీనికి శామవర్మ అనే స్థపతి రూపకల్పన చేశాడని చెబుతారు. మధ్యలో ఉన్న పెరియకోయిల్ (పెద్ద గుడి) ఒక కోటలోపల ఉన్నది. ఇక్కడి 65 మీటర్ల ఎత్తయిన విమాన గోపురం ప్రపంచంలోనే ఎత్తయిన గోపురంగా కీర్తి గడించింది. ఈ విమాన గోపురం నీడ మధ్యాహ్న సమయంలో నేల మీద పడకుండా ఉండడం, నాటి శిల్పుల ఆలయ నిర్మాణ నైపుణ్యానికి అద్భుత నిదర్శనం. ఆలయ గోపుర శిఖరం ఏక శిలా నిర్మితం.

గంగైకొండ చోళపురంలోని బృహదీశ్వరాలయ నిర్మాణాన్ని మొదటి రాజేంద్రచోళుడు క్రీ.శ. 1035లో పూర్తి చేశాడు. గర్భగృహం మీది విమాన గోపురం 53 మీటర్ల ఎత్తయినది. దారాసురంలోని ఐరావతేశ్వర ఆలయాన్ని రెండవ రాజరాజ చోళుడు నిర్మించాడు. విమాన గోపురం ఎత్తు 24 మీటర్లు.

ఆలయ నిర్మాణాల పట్ల చోళుల అభిమానానికీ, నాటి శిల్పుల అనుపమ కళానైపుణ్యానికీ, వెయ్యేళ్ళ నాటి తమిళ నాగరికతావైభవానికీ ఈ మూడు ఆలయాలు చక్కని తార్కాణాలుగా వెలుగొందుతున్నాయి. 1987వ సం.లో యునెస్కో బృహదీశ్వరలయాన్ని ప్రపంచ వారసత్వ సంపదగా ప్రకటించింది. ఆ తరవాత 2004 సం.లో ఈ మూడు ఆలయాలూ 'చోళుల నాటి గొప్ప సజీవ ఆలయాల'ని తెలిసిరావడంతో మిగిలిన రెండు ఆలయాలను కూడా మొదటి బృహదీశ్వరాలయానికి విస్తృతిగా గుర్తించింది.

# వార్తలలో బాలలు

## జాతీయ అవార్డు



మదురైకి చెందిన ఎం. లవిణశ్రీ 2006 నవంబర్ 14వ తేదీ జరిగిన బాలల దినోత్సవంలో నేషనల్ చైల్డ్ అవార్డ్ ఫర్ ఎక్సెప్షనల్ అచీవ్‌మెంట్‌ను అందుకున్నది. ఆమె మూడేళ్ళ పాపగా ఉన్నప్పుడే సుప్రసిద్ధ తమిళ నీతిగ్రంథం తిరుక్కురళ్ లోని 1,330 ద్విపదలను చూడకుండా అప్పగించి లిమ్కా బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్‌లో స్థానం సంపాయించింది. ఆమె అప్పటినుంచి వివిధ సాహిత్య కార్యక్రమాలలో తన ప్రతిభను ప్రదర్శిస్తూ అనేక బహుమతులు అందుకుంటున్నది. వాటిలో తమిళనాడు ప్రభుత్వ నగదు బహుమతి కూడా ఉన్నది. ప్రస్తుతం లవిణశ్రీ మూడవ తరగతి చదువుతున్నది.

## ప్రపంచ టైటిల్



గోవాకు చెందిన ఇవానా మరియా ఫర్టాడో నవంబర్ 28వ తేదీ టర్కీలోని అటాల్యాలో చెస్‌లో 8-ఏళ్ళలోపు పిల్లల ప్రపంచ టైటిల్‌ను దక్కించుకున్నది. ఫైనల్‌రౌండ్‌లో ఆమె కజకస్థాన్‌కు చెందిన జన్‌సాయా అబ్దుమాలిక్‌ను ఓడించింది. ఇండియా నుంచి వెళ్ళి వరల్డ్ ఏజ్-గ్రూప్ టైటిల్‌ను అందుకున్న వారిలో ఈమె - కోనేరు హంపి, ద్రోణవల్లి హారిక తరవాత మూడవ బాలిక అన్న మాట. ఈ పాపాయి విజయం తనకెంతో ఆనందం కలిగించినట్టూ, మరో 'ఏజ్-గ్రూప్' ఛాంపియన్ వచ్చిందనీ వరల్డ్ ఛాంపియన్ విశ్వనాథన్ ఆనంద్ తెలియజేశాడు.

## సంగీత దర్శకుడు



కేరళరాష్ట్రం క్విలాన్‌కు చెందిన వైశాఖ్ బిజాయ్ 'ఆద్యరాగమ్' అనే ఆల్బమ్‌కు సంగీత దర్శకత్వం వహించాడు. అందులో శ్రీనివాస్, మధుబాలకృష్ణన్, విధుప్రతాప్, మిన్‌మిని మొదలైన ప్రముఖ గాయనీ గాయకులు పాడారు. 2003లో మొట్టమొదటి సారిగా వైశాఖ్, కె.జె. జేసుదాసుతో కలిసి వేదికపై పాడాడు. నాలుగేళ్ళలో అతడు సంగీత దర్శకుడిగా మారాడు. వైశాఖ్ ఎర్నాకుళం లోని ఒక పాఠశాలలో తొమ్మిదవ తరగతి చదువుతున్నాడు.

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....



విజ్ఞాన వీచికలు :

## పచ్చబొట్టు

చర్మంలోకి పచ్చటి సిరా లేదా రంగును పంపి చేతుల మీద, కాళ్ళమీద శరీరంలో మరే భాగం లోనైనా సరే పచ్చబొట్టు పొడుస్తారు. చర్మం మీది పైపొర కింది కణజాలంలోకి సూది ద్వారా సిరాను ఎక్కిస్తారు. అందువల్ల పచ్చబొట్టు ఎన్న టికీ కరిగిపోకుండా, వెలిసిపోకుండా ఉంటుంది.

పచ్చబొట్టు పొడుచుకునే అలవాటు అతి ప్రాచీన కాలం నుంచే ప్రాచుర్యంలో ఉన్నది. క్రీ.పూ. 3300 నాటి ఐస్‌మన్ శవంలో పచ్చబొట్టు ప్రప్రథమంగా కనిపించినట్టు కొందరు విజ్ఞానవేత్తలు భావిస్తున్నారు. అయితే, క్రీ.పూ. 2000 సం.ల నాటి ఈజిప్టు, నుబియా మమ్మీస్‌లోనే పచ్చబొట్టు ఉన్నట్టు స్పష్టంగా గుర్తించబడింది.

సులభంగా గుర్తించడానికి వీలవుతున్నది గనక, పచ్చబొట్టు పొడవడం ఇవాళ ప్రపంచ వ్యాప్తంగా అన్ని దేశాల సైన్యాలలోనూ ఆచరణలో ఉన్నది.

మన పరిసరాలు

## తుపానులకు పేర్లు



దక్షిణ కొరియా సముద్ర తీరాన్ని మయేమీ అనే భయంకర మైన తుపాను ముంచెత్తి ప్రాణనష్టాన్నీ, అపార ఆస్తినష్టాన్నీ కలిగించింది. మయేమీ అన్నది ఒక ఆడపేరు.

అస్ట్రేలియాకు చెందిన క్లెమెంట్ ఎల్‌రెగ్గీ అనే వాతావరణ వేత్త తుపానులకు పేర్లు పెట్టడం ప్రారంభించాడు. అయినా అతడు సవారీ, రాకెం మొదలైన బైబిల్ పాత్రల పేర్ల వరకే పరిమిత మయ్యాడు. రెండవ ప్రపంచయుద్ధ సమయంలో అమెరికన్ రేడియోలో ఒక తుపాను హెచ్చరిక ప్రసారం చేయబడింది. దానిని ప్రసారం చేసిన ఆపరేటర్, ''ప్రతి గాలీ లూయీ పేరును చెబుతోంది,'' అని చెప్పడం జరిగింది. తుపానులకు మామూలు వ్యక్తుల పేర్లు పెట్టడం దానితోనే ఆరంభమయింది.

# ఫోటో వ్యాఖ్యల పోటీ


MAHANTESH C. MORABAD

ఈ ఫోటోలకు
ఒక్క
మాటలోగాని,
చిన్నవాక్యంలోగాని
వ్యాఖ్యలు
రాయగలరా?
రెండు
వ్యాఖ్యలకూ
సంబంధం
ఉండాలి.


MAHANTESH C. MORABAD



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా
మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు ఏప్రిల్ 2008 సంచికలో ప్రచురిస్తాం.
ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, జెవిఎల్ ప్లాజా 6వ అంతస్తు, 626, అన్నాసాలై,
తేనాంపేట, చెన్నయ్ - 600 018.

## అభినందనలు

డిసెంబర్ నెల పోటీ ఫలితాలు
బి.వి.ఆర్.ఎస్.ఎస్.ఎస్. ప్రసాద్
ఫ్లాట్ నం. 302, ఎం.వి.ఎస్ మేన్షన్స్
జిల్లా గ్రంథాలయం ఎదురుగుండా
మహారాణిపేట,
విశాఖపట్నం - 530 002
(ఆం.ప్ర.)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో : చదివేవారికి విద్యే సమస్తం!
రెండవ ఫోటో : చిన్నారికి ఆటబొమ్మే నేస్తం!

## సమాధానాలు :

1. మేడమ్ భికైజీ కామా; జర్మనీ స్టట్‌గార్ట్‌లో 2. డా. ఎస్. రాధాకృష్ణన్
3. విశ్వకవి రవీంద్రనాథ టాగూర్; విశ్వభారతి 4. ఆర్. వెంకటరామన్
5. శ్రీమతి విజయలక్ష్మీ పండిట్; యునైటెడ్ ప్రావిన్స్

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, JVL Plaza, 6th Floor, 626 (Old 501), Anna Salai, Teynampet, Chennai - 600 018. Editor : B. Viswanatha Reddi (Viswam)

# CALL IT A MAGAZINE PLUS!




## MUCH MORE THAN A MAGAZINE FOR TINY-TOTS – TO KINDLE YOUR YOUNG ONE'S IMAGINATION




* Contest To Appear In The April, May And June Issues

**The young and the old react thus:**

The info-park pages are very useful as they help us to know various facts about different topics. (January 2008)
*- S. Athreya Uppili (8), Bangalore*

The page for Parents and Teachers is a wonderful addition to the unique Junior Chandamama. Very often, I see my son poring over the pages when he runs to me for a meaning, explanation or clarification. (January 2008)
*- Kamaljit Arora, Chandigarh*

**JUNIOR CHANDAMAMA MAKES AN IDEAL BIRTHDAY GIFT FOR YOUR CHILD OR HIS/HER FRIEND.**

Annual subscription (12 issues delivered at door) Rs. 170. Payment by Cheque / D.D. favouring Chandamama India Ltd.
(Please add Rs. 90 on non-Chennai cheques)

Please mail to : **Chandamama India Ltd.,** JVL Plaza, 6th floor, 626 Anna Salai, Teynampet, Chennai - 600 018
Tel : (044) 24334455 Telefax : 24322103 email : chandamama@chandamama.com web : www.chandamama.com

**Write down the child's name, age, class, school, and complete residential address with PIN code. Allow 4 weeks for the first copy to arrive by post.**

CHANDAMAMA (Telugu) Feb 2008 RNI No. 1114/57. Regd No. TN/CC(S)Dn/159/06-08
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08



# కాడ్‌బరీ బబ్బా సాహసాలు

నలుగురు కుర్రాళ్ళు అమ్యూజ్‌మెంట్ పార్క్‌లోని వరుసలో ఆత్రుతగా నిలబడ్డారు.



వాళ్ళు రోలర్ కోస్టర్ రైడ్ కోసం ఉద్వేగంతో ఎదురు చూస్తున్నారు.




వాళ్ళు రైడ్‌కు ప్రవేశించే సమయంలో, ఒక పెద్ద కుర్రాడు వచ్చి అడ్డుకున్నాడు.




పిల్లలు ఎంతగానో వేడుకున్నారు.




ఆశాభంగంతో తిరిగి వెళుతూన్న వాళ్ళను, ఈలవేసి పిలిచి, వాళ్ళకేసి బబ్బాలూ పాకెట్లు విసిరివేసింది.



అబ్బాయిలూ, రోలర్ కోస్టర్ కావాలా? వీటిని నోట్లో వేసుకోండి...



వాళ్ళ బబ్బాలూ క్యాండీతిని బుడగ ఊదారు.



ఒక్కొక్క బుడగ జ్యూసీ మస్తీతో బ్రహ్మాండమైన రోలర్ కోస్టర్ రూపొంది...




...పిల్లల్ని పైకీ, కిందికీ, లేస్తూ, దిగుతూ, తిప్పుతూ స్వారీ తీసుకెళ్ళింది.

